# ఆంధ్రప్రదేశ్



"సుగంధి పుష్పం, వదనం సుగంధి,
రశ్చ తద్భావనయా సుగంధి."

మే, 1965
25 పైసలు

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 9
సంచిక : 7

మే, 1965
వైశాఖ - జ్యేష్ఠ 1887 శకం

ప్రధాన సంపాదకుడు
టి. రామచంద్రరావు

సంపాదకుడు :
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## ఈ సంచికలో

మొదటి అట్ట :
ఫొటో : శ్రీ యస్. ఆర్. కె. రావు
"సుగంధి పుష్పం, వదనం సుగంధి.
మనశ్చ తద్భావనయా సుగంధి."
"పువ్వు పరిమళయుక్తము, ముఖము పరిమళయుక్తము. ఈ రెంటిని భావించుటచేత (చూచువారి) మనస్సుగూడ సుగంధి యగును"

రెండవ అట్ట :
ఫొటో : శ్రీ టి. రామచంద్రరావు
ప్రధానసంపాదకులు
"అకృత్రిమానుభావైర్హి పశ్యతాం ప్రమదాఽవహైః
అర్భకౌ పరిదృశ్యేతే మల్లికాముకుళావివ."
"చూచువారికి సంతోషమును కలిగించునట్టి అకృత్రిమములైన భావములచేత ఈ శిశువు లిరువురు మల్లెమొగ్గలవలె కనబడుచున్నారు.

మూడవ అట్ట :
ఫొటో : శ్రీ యస్. ఆర్. కె. రావు
"ఆలక్ష్య దంతముకుళాన్ అనిమిత్తహాసైః
ఆనందం అక్షియుగళస్య సమాదధాతి"
"అకారణ (అకృత్రిమ) ములగు నవ్వులచేత మొగ్గలవంటి దంతములను కనబరచుచు (చూచువారి) కనుదోయికి (ఈ శిశువు) ఆనందమును కలిగించుచున్నది.

నాల్గవ అట్ట :
ఫొటో : శ్రీ ఎస్. ఆర్. కె. రావు
"న వివృతో మదనో న చ సంవృతః"
"మన్మథవికారము స్పష్టముగా ప్రకటితము కాకుండను, అప్రకటితము కాకుండను ఉన్నముగ్ధ నాయిక యీమె"





ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు



# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ!

మరొకసారి మళ్ళీ మన దేశాకాశమండలంలో యుద్ధ మేఘాలు అలుముకున్నాయి. మన సరిహద్దుల్లో యుద్ధభేరీలు తిరిగి మ్రోగుతున్నాయి. ఈసారి మన పొరుగున వున్న పాకిస్తానే యీ యుద్ధ వాతావరణాన్ని సృష్టించింది. ఇంతవరకూ యిది భారత వ్యతిరేక ప్రచారం చేస్తూ వచ్చింది. చెదురుమదురుగా కాల్పులు సాగిస్తూ వచ్చింది. కాని నేడు పాకిస్తాను అధ్యక్షుడు చైనా వెళ్ళివచ్చిన తర్వాత ఆ దేశంతో అతడు చేసుకున్న కొత్త ఒప్పందం మేరకు తన రాజ్యవిస్తరణకాంక్ష అధికమై పాకిస్తాను భారీఎత్తున దురాక్రమణ చేయడానికి సన్నద్ధమైంది.

ఇందుకు అనువైన స్థలంగా కచ్‌ను ఎన్నుకుంది. నిజానికి ఈ ప్రాంతపు సరిహద్దులు స్పష్టంగా గుర్తించబడినవే. అయినప్పటికీ ఈ సరిహద్దులు సరికావని సవాల్‌చేస్తూ పాకిస్తాన్ ఆసియాలో కమ్యూనిజాన్ని రూపుమాపడానికని సీటో ఒప్పందంక్రింద తనకు ఉదారంగా లభించిన భారీ ఫిరంగులూ, టాంకులతో ఆ ప్రాంతంలోని మనగస్తీ కేంద్రాలపైన అకస్మాత్తుగా పెద్దఎత్తున విరుచుకు పడింది. మూడేళ్ళక్రిందట చైనా చాలా హేయంగా, కుత్సితంగా జరిపిన దురాక్రమణను ఇప్పుడు ఈ పాకిస్తాను మార్గదర్శకంగా తీసుకున్నది. కొద్దిరోజుల క్రిందట అకస్మాత్తుగా మనమీద దురాక్రమణ జరిపి, నంగనాచిలాగ ఇదంతా స్వరక్షణకై చేసినదంటూ ప్రపంచాన్ని మభ్యపెట్టుతూ వాదిస్తున్నది. ఇదేమిటని మనం ప్రశ్నిస్తే తనతప్పును కప్పిపుచ్చుకునేందుకు యుద్ధవిరమణ చేయాలనీ, యిరు దేశాల సైన్యమూ, సరిహద్దుకు 20 మైళ్ళ దూరం ఉపసంహరించుకోవాలనీ పాటపాడటం ప్రారంభించింది. ఇదంతా కపటనాటకం అని స్పష్టంగా తెలుస్తూనే వుంది. తాను దురాక్రమణ చేసిన భూభాగంమీద తన ఆధిపత్యాన్ని ప్రకటించడమే కాక, మన సరిహద్దుకు ఇరవై మైళ్ళ మేర వరకూ మనల్ని మనభూభాగాన్ని వదులుకోమని చెప్పడంకూడా దాని ఉద్దేశమనే తెలిసింది. తేనె పూసిన కత్తివలె వ్యవహరిస్తున్నది. చివరకు ఇది అబద్ధాన్ని నిజంగా నమ్మించే ధోరణిలో ప్రచారం చేయడం ప్రారంభించింది. అసలు ఈ కచ్ ప్రాంతాన్నే యిది దురాక్రమణకు ఎన్నుకోవడానికి అనేక కారణాలు వున్నాయి. ఈ ప్రాంతాన్ని మన సరిహద్దు పోలీసులే కాపలా కాస్తున్నారు. భౌగోళికంగా ఇది పాకిస్తానుకు లాభదాయకమైన ప్రదేశం.

ఈ ప్రాంతంలో నూనెగనులు ఎన్నో వున్నాయి. పాకిస్తాన్‌కు ఇప్పుడు చమురు కొరత వున్నట్లు అందరికీ విదితమే.

పాకిస్తాను దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి యీ ప్రాంతంలో కొంత స్థానం కల్పించుకుందామని కొన్ని విదేశీయ చమురు కంపెనీలు ఆసక్తితో ఉన్నట్లు పత్రికల వార్తలు తెలియజేస్తున్నాయి. తన కొత్త మిత్రుడు మరోసారి—అంటే బహుశా యీ సారి సిక్కింవైపు - భారతదేశంపై దురాక్రమణ చేయడానికి వచ్చినప్పుడు దానికి సహాయం చేయడానికి పాకిస్తాన్ కచ్‌లోనూ, ఇతరచోట్లను తన బలాన్ని కేంద్రీకరించడంలోగల అంతరార్థమని తెలుస్తున్నది. ఈ రెండు సవాళ్ళను ఏ పరిస్థితుల్లోనూ ఎదుర్కొనడానికి మన సైన్యం సర్వసన్నద్ధమై వున్నదనడంలో సందేహం

లేదు. మనపై దురాక్రమణకు పూనుకున్న మన పొరుగుదేశం పాపం ఎప్పుడో ఒకప్పుడు పండక మానదు. అయితే మనమంతా మరొకసారి కలిసికట్టుగా, అప్రమత్తతతో వుండవలసిన సమయం ఆసన్నమైందని తెలుసుకోవలసివుంది. ఈ క్లిష్టతరుణంలో సైనికుల మీదనేగాక ప్రజల భుజస్కంధాల మీదకూడా ఎన్నో బాధ్యతలు వున్నాయని ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు. ఇలాంటి క్లిష్ట పరిస్థితే ఒకప్పుడు ఉత్పన్నమైతే ప్రజలందరూ ఎంతో ప్రశంసనీయంగా, సమర్ధవంతంగా, తెలివిగా ప్రవర్తించారు. మన సరిహద్దులపై చైనా దురాక్రమణ జరిపినప్పుడు మనం ఏ విధంగా ప్రవర్తించామో అదే విధంగా ప్రవర్తించాలి.

భేదాలను విస్మరించి, అంతా కలిసికట్టుగా ఈ కొత్త దురాక్రమణను ఎదుర్కోవడం ప్రతి భారతపౌరుని కర్తవ్యం. వ్యక్తిగత అవసరాలను గురించీ, హక్కులనుగురించీ మాట్లాడడం మాని, మాతృదేశంకొరకై కృషి చేతాము. మన లక్ష్యాలన్నీ మాతృదేశ పరిరక్షణవైపే వుండవలెను. భయపడవలసిన అవసరం మనకు ఏమాత్రమూలేదు. భయాన్ని విస్మరింతాము. మన పరిపూర్ణ స్వాతంత్ర్యాన్నీ, సద్భావాన్నీ పరిరక్షించుకునే నిమిత్తం, మనం సమైక్యంగానూ, పటిష్ఠంగాను నిలిచేనిమిత్తం నిరంతరం శ్రమకు ఓర్చి పనిచేతాము. మన భూభాగంపై దురాక్రమణకు పూనుకున్న ప్రతిఒక్కరినీ దూరంగా తరిమికొట్టడానికి అనవరతమూ కృషి చేతాము.

పుకార్లను నమ్మవద్దు. మనకు ఇదొక క్లిష్టమైన పరీక్షసమయం. ఇప్పుడేమన నిజాయితీని మాతృదేశాభిమానాన్నీ మనం ఋజువు చేసుకోవాల్సిఉంది. ఈ క్లిష్టసమయంలో పరిపూర్ణ విశ్వాసంతో, ఆత్మబలంలో దృఢమనస్కులమై మనం నిలవడం అవసరం. అన్నిరంగాలలోనూ వుత్పత్తులను పెంచితే అది సైనిక శక్తికి అండగా వుంటుంది.

ఎన్. సి సి లోనూ, ఎన్. సి. సి. రైఫిల్సులోనుచేరి ద్వితీయ రక్షణశ్రేణిగా రూపొందాలని విశ్వవిద్యాలయ విద్యార్థు లందర్నీ నేను కోరుతున్నాను. ఆతర్వాత ఉన్నతశిక్షణ అవసరమైతే కావచ్చు. విద్యార్థులు కొన్ని యిబ్బందులకు గురికావలసి వచ్చినప్పటికీ క్రమశిక్షణాత్మకమైన విద్యను, శిక్షణను పొందడం అవసరం.

వర్తమాన పరిస్థితుల్లో రచయితలు, కవులు కళాకారులు చేయవలసిన పని ఎంతో వుంది. శతాబ్దాల క్రిందటినుంచీ కూడా భారతదేశంలో కవులు యుద్ధ సమయాలలో ముందునిలిచి ప్రజలను ప్రబోధిస్తూ, ఉత్తేజ పరుస్తూ వచ్చినారు. శౌర్య గానాలూ, సాహస గానాలు, పదాలు వంటి వీరరస ప్రధాన సాహిత్యం యీనాడు కూడా ఎంతో అవసరం. దాస్య శృంఖలాలను త్రెంపి పటాపంచలు చేయడానికీ శాంతి, స్నేహవాత్సల్యాలు ప్రతిష్ఠించడానికీ, చీకటిలోనుండి వెలుతుర్లోకి కాలూనడానికీ, సత్యాన్ని నెలకొల్పడానికీ ఒకదేశం చేసే మహోజ్వల వీరకృత్యాలను కవులూ, రచయితలూ గ్రంథస్థం చేయడం ఎంతో అవసరం. స్వాతంత్ర్యం కన్న కవికి మరొకటి ప్రియతమమైనది లేదు. దురాక్రమణ కవి హృదయం మీద చేసిన సామాన్య గాయం మాత్రమే కాదు అంత కన్నా అది బాధాకరమై అతి తీక్ష్ణమైనదిగా భావించవలసి వుంటుంది. ఇది నిరంతర శాంతితో సంకృషి చేస్తున్న మానవాళి పైకి రువ్విన తుపాకీ గుళ్ళగాయం.

జన బాహుళ్యంలో ఉప్పొంగే ఉత్సాహమూ, ఆవేశమూ, సాహస కృత్యాలకు, మహత్తర కార్యాలసాధనకు దోహదంచేసేవిగా ఉండాలి. అట్లాలేకుంటే, జనుల ఆవేశం వెర్రితలలు వేయవచ్చు. మన రచయితలు సామాన్య మానవునిలో దేశభక్తిని ప్రేరేపించాలి. బహుభాషలుగల మనదేశంలో ప్రజలవద్దకు వెళ్ళడానికి అనేక భాషలను ఉపయోగించ వలసిన అవసరం ఉన్నది. మనదేశ సరిహద్దులపై జరిగిన దురాక్రమణ ఫలితంగా, రాజకీయ సమస్యలేగాక పవిత్రమైన మన స్వాతంత్ర్యానికికూడా ప్రమాదం వాటిల్లే సమస్యలు ఉత్పన్నమయిన విషయాలను రచయితలు ప్రత్యేకంగా తెలియజేయాలి. గతంలోని మన ఘనవిజయాలను గుర్తుంచుకొని మాతృభూమిపట్ల మనకుగల విధ్యుక్తధర్మాన్ని ప్రజలు తెలుసుకునే విధంగా చేయాలి.

జర్నలిస్టులైన రచయితలుకూడా దేశరక్షణ కృషిలో ప్రత్యేక పాత్ర నిర్వహించడం అవసరం. దురాక్రమణదారుని దురద్దేశాలను వెలిబుచ్చి దానిలోని వాస్తవ విషయాలను పత్రికలలో ప్రచురించి మన వాదాన్ని ప్రజలకు విస్పష్టంగా తెలిపితే, వారు ఈ వాదంలోని నిజానిజాలు తెలుసుకోగలుగుతారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ప్రజాస్వామ్యానికి అమోఘంగా సేవచేసిన ప్రసిద్ధ విదేశీయ జర్నలిస్టు వాల్టర్ లిప్‌మెన్‌లాగా మన పత్రికా విలేఖరులు వ్యవహరించవలెను.

అత్యవసర పరిస్థితి ఉన్నా, లేకున్నా రచయితల బాధ్యతమాత్రం ఎప్పుడూ సర్వోత్కృష్టమైనదే. మానవుడు ఎప్పుడు అత్యవసర పరిస్థితిని ఎదుర్కొంటూనే వుండాలి. రచయితలు. సమకాలీన పరిస్థితులకు అనుగుణంగానే రచనలు చేస్తూ, జీవిత శాశ్వత విలువలకుగూడా రచనల్లో స్థానం కల్పిస్తూ ఉండాలి. ప్రజలు తమను తాము తెలుసుకునేట్లు రచయితలు చేయాలి. రచయిత కర్మాగారం మానవుని హృదయమే. కొన్ని వైపులనుండి వీచే విషవాయువుల నుండి దేశసమగ్రతను రక్షించడానికి ప్రముఖవ్యక్తులు కృషి చేయాలి. మన రచయితలు సత్యాన్ని దృష్టిలో ఉంచుకొనే రచనలు చేయాలి. వారి ఘర్జనలతో ఆకాశం ప్రతిధ్వనించాలి.

మన జీవితపు విలువలను కాపాడుకోవాలంటే, మనలో ప్రతిఘటించేశక్తికి యీ విపరీత పరిస్థితి నిజంగా ఒక సవాలుగా మనం భావించాలి. స్వాతంత్ర్య రక్షణకొరకు మనప్రాణాలను సైతం అర్పించడానికి మనంసిద్ధంగా లేనప్పుడు స్వాతంత్ర్యానికి అర్హులమని చెప్పుకోవడం సిగ్గుచేటు. ఈ విషయంలో మహాత్మాగాంధీ ఉపదేశం యిలాగువున్నది. "జాతినంతటినీ నిర్వీర్యం చేయడానికన్నా, దౌర్జన్యమే వెయ్యిరెట్లు అధికమని నేను భావిస్తాను." రవీంద్రనాథ టాగూరు శాంతిని కాంక్షించేకవి. అయితే ఒకప్పుడు ఈ విధంగా ఆయన గానంచేశాడు.

"శాంతిని ప్రసాదించమని మాత్రమే మిమ్ములను అర్థించాను. యుద్ధకవచం ధరించడంలో నాకు సహాయపడమని యిప్పుడు మీ ముందు నిలుచున్నాను."

జై హింద్ !!

## సీరియల్ నవల

# 2

నా అంచనా తప్పలేదు. ఇంటరు ఫస్టు క్లాసులో పాసయాను రిజల్టు తెలిసేసరికి నేను నందిగామలో మా పెద్దక్కయ్య గారింట ఉన్నాను. మా అక్కయ్య పాత భాగోతమంతా తిరగేసింది. ఆడవాళ్ళకు గతాన్ని నెమరు వేసుకోవటంలో ఉన్న ఆనందం ఇంతా అంతా కాదు. భవిష్యత్తు గురించి ఆలోచిస్తే భయం వేసినప్పు డెవరన్నా గతాన్ని తలుచుకుని ధైర్యం తెచ్చుకోక తప్పదేమో. వ్యక్తులయేది జాతి అయేది. జీవితంలో అయేది, సాహిత్యంలో అన్యాయమైనవి ఉన్నాయి. కాని వాటి కాలాకు భయంకరత్వాన్ని గురించిగాని. అన్యాయాన్ని గురించిగాని ఆవిడ బాధపడు తున్నట్టు కనిపించలేదు. సినిమా తెరమీది విషయాలను లీనాలీనావస్థలో చూసినట్టుగా గతాన్నావిడ స్మరించింది.

నాకు మటుకు భవిష్యత్తుకన్న గతమే భయంకరమైనది. చచ్చినవాళ్ళు దయ్యాలై పట్టుకుంటారుగాని పుట్టబోయే వాళ్ళు పట్టుకోరు. అన్యాయాలు భవిష్యత్తులో జరగకుండా చూసే అవకాశం ఈనాడు బతికున్న వాళ్ళకున్నది. గతం అట్లా కాదే! దానిలో మంచి మానవుల దుర్మార్గాన్నీ, దురన్యాయాన్నీ, అవివేకాన్నీ తుడిచివెయ్యటానికి లేదే! రేపు భారత దేశం స్వాతంత్ర్యం కోసం ... సంఘటన తలుచుకుని మానవజాతి తరఫున సిగ్గుపడుతుంటాను.

మా నాన్నా మా అమ్మా పెళ్ళాడకపోతే నేను పుట్టివుండను గనక నేను వాళ్ళ పెళ్ళికి సిగ్గుపడటంలో అర్థంలేదని ఎవరన్నా ఆక్షేపించవచ్చు. కాని అది అర్థంలేని ఆక్షేపణ. నేను పుట్టివుండటంకన్న, ఆ పెళ్ళి జరగకుండా వుండటం ముఖ్యమన్న భావం నాలోనుంచి పోదు. పైగా ఆ పెళ్ళి గురించి సిగ్గుపడే శక్తి నాకు పుట్టుకతో వచ్చినదికాదు. ఏ సంస్కృతో నాలో ఆ భావాన్ని నాటింది. ఆ సంస్కృతి నాకు బాహ్యమైనది. నేను లేకపోయినా అది ఉంటుంది, ఉండాలి. ఆ సంస్కృతి ఎంతగా



వ్యాపిస్తే జీవితానికంత మంచిది. జరగగూడని పనులు క్రమంగా జరగకుండా పోవాలంటే అంతకుమించి మరో పద్ధతిలేదు.

మా బావకూడా నాతో తన వ్యవసాయం గురించీ, కోడెదూడల పెంపకం గురించీ మాట్లాడారు.

"ఎందుకొచ్చిన ఫస్టుక్లాసురా! కూటికా, గుడ్డకా? హాయిగా నాతోబాటు వ్యవసాయంలో ప్రవేశించు. ఓ పాతిక ఎకరాలు మక్తాకు తీసుకుందాం. కాలుమీద కాలేసుకు తింటూ కూర్చో. పెళ్ళిచేసుకో. పెళ్ళాంచేత పాడిచేయించు." అన్నారు సత్యంబావ.

అయేది– "గోదావరి పావనోదారవార మఖిలభారతము మాదన్ననాడు!" "ఒకనాడు కలదాంధ్ర యువకులు" ఏదో చేసినారు!

తప్పేదేముందీ? అంతా విన్నాను.

అక్క గతానికి తాను కోరిన రంగులు పులిమిందా? తన కిష్టంలేనివి మరిచిపోయిందా? జరగనివికూడా అవ్యక్త ప్రేరణతో జరిగినట్టు చెప్పిందా? ఏమో? ఎవరు చెప్పగలరు? నన్ను గురించిన సంగతులే ఆవిడ చెబుతుంటే నాకు కొంచెంకూడా జ్ఞాపకం రాలేదు. మరుపు నాదేనేమో!

కాని ఒక్కటి మాత్రం రూఢిగా చెప్పగలను. ఆవిడ చెప్పుకొచ్చిన గత చరిత్రలో భయకరమైన సన్నివేశాలున్నాయి. ...త్ర్యం కావచ్చు. కాని రెండువందల ఏళ్ళ బ్రిటిషు పరిపాలనను చరిత్రనుంచి ఎట్లా కడిగివెయ్యటం? అంత పెద్దవిషయాలు కూడా తీసుకోనవసరంలేదు. నేను పుట్టకపూర్వం మా అమ్మకు జరిగిన అన్యాయమైన పెళ్ళిని నే నీనాటికి క్షమించలేదు. ఇవాళ మా అమ్మా లేదూ, పట్టుపట్టి ఆ పెళ్ళిచేసిన ఆవిడ తండ్రీ లేడు. అయినా ఒకచిన్న అప్సరసలాంటి మా అమ్మను పెద్దగోరిల్లాలాంటి మానాన్నకు ఇచ్చి చెయ్యటమూ, వాళ్ళిద్దరి వయసు మధ్యాగల పాతికేళ్ళతేడా తలుచుకున్నప్పుడల్లా నన్ను బాధిస్తూనే ఉంటుంది. ఒకరి

## కొడవటిగంటి కుటుంబరావు



నా భవిష్యత్తుకు పథకాలువేసే హక్కు మా బావకు ఒక విధంగా ఉన్నది. మా కొలకలూరు పొలం ఆరెకరాలూ ఆయనే చూస్తున్నాడు. చూస్తున్నా డనటంకన్న దాంతో ఆడుకుంటున్నా డనటం సరిగా ఉంటుందేమో. తనపొలంలో చెయ్యావి పనులన్నీ ఆయన మా పొలంలో చేసేవాడు. ఒకసారి రెండెకరాల్లో చెరుకు వేసి, బెల్లంకాయించి నాకు నష్టం తెప్పించాడు. ఇంకోసారి దొర పొగాకు మూడెకరాల్లో వేసి నష్టం తెప్పించాడు. ఒకసారి రెండో పంటకింద జనుమువేసేవాడు. ఒకసారి మినుమువేసేవాడు. ఏమి టేమిటో చేసేవాడు.

అందుచేత ఆయన నామీద గార్డియను హక్కులు చూపేవాడు. మా బాబాయికూడా, "ఏం చేద్దామనుకుంటున్నావురా?" అని అడిగేవాడు. కాని మా సత్యంబావ, "ఇట్లా చెయ్యి." అనేవాడు.

"నా కప్పుడే పెళ్ళేమిటి?" అన్నాను.

"ఒరే నీ యీడుకు నేను —" అని బావ ఆగిపోయాడు. నాయీడుకు మా సుబ్బక్కయ్య ఇంకా కాపరానికి రాలేదుగనక ఆయన ఏంచేసినా పైకి చెప్పుకొనటానికి లేదు.

"నువ్వొక పెళ్ళికొడుకు, కూతురునన్నా కనకపోతివి. అట్లాగేచేసుకుని ఉందును." అన్నాను.

మా బాబాయివాళ్ళింటికి వెళ్ళి రెండు రోజులున్నాను. నేను పాసయినానని తెలిసి బాబాయి, "తరవాత కార్యక్రమమేమిటిరా?" అన్నాడు.

"ఇంకేముందీ? బియ్యే చదువుతాను."

"ఎక్కడ?"

"గుంటూరులోనే చదవాలనుంది. ఆ కాలేజీ వదలాలనిలేదు.

"పెళ్ళిసంబంధా లేవన్నా చూడమన్నావుటోయ్?" అన్నది పిన్ని.

"ముక్కుపచ్చలారని వద్దెనిమిదేళ్ళ వాణ్ణి పట్టుకుని అందరూ పెళ్ళిచేసుకోమంటారేమిటి?" అన్నాను.

"పెళ్ళయినమర్నాడు అన్ని పచ్చలూ అవే ఆరతాయి — వగలు పోతున్నావు. వగలు!" అన్నదావిడ.

"అన్నయ్యా, మేం వర్కుప్చూశాం. హిహిహి! సింహం ఎట్లా అరిచిందనుకున్నావు?"

మా బాబాయి కొడుకులిద్దరూ సింహాలైపోయి ఒకరినొకరు చూసుకుంటూ పోటీపడి అరవసాగారు. ఎందుకో చెప్పలేను. నాకూ వాళ్ళలాగె అరవాలనిపించింది.

"శ్రావణమాసంలో మేం గుంటూరొస్తామేమోలే. మా అఖరు బావమరిది సీమకు గుంటూరులో సంబంధం చూస్తున్నారు. కుదిరివస్తే." అన్నాడు బాబాయి.

కొత్తచోట పొద్దుగడవదు. నందివెలుగులో నాలుగు రోజులుగడిపితే నాలుగు యుగాలు గడిచినట్టున్నది. మా బావగారింట పుస్తకాలుండవు. గుంటూరునుండి వచ్చినాక పుస్తకం తిరగేసిన పాపాన పోలేదు. మా బాబాయిదగ్గిర పుస్తకాలుంటాయి. ఆయనపిల్లలపేపర్లు దిద్దటానికూర్చునప్పుడాయన బీరువా గాలించాను. వసుచరిత్రా, మనుచరిత్రా, కాశీఖండమూ, కళాపూర్ణోదయమూ, వీరేశలింగంగారి ప్రహసనాలూ లాటి పుస్తకాలు చాలాఉన్నాయి. కాని పెన్నిధిలాగా భాసనాటకాలు, చిలకమర్తి వారి అనువాదం కంటపడేసరికి మిగిలిన పుస్తకాలన్నీ మనసులోనుంచి మాయమయాయి.

ఇష్టమైన భోజనానికి కూర్చునేవాడిలాగా ఆ పుస్తకంతీసుకుని చదవటానికి వస్తే మంచంమీద నడుమువాల్చాను. కాని అయిదు నిమిషాల అనంతరం నేనుపొందిన ఆశాభంగం వర్ణనాతీతం. అవి భాసుడి నాటకాల్లాలేవు. ఎవరో చేతకానివాడు రాసినట్టున్నాయి. నేను ఏనాటకంగాని అరపేజీపైన చదివానని కాదు. ఒకటికాదని ఇంకొకటి. అదికాదని మరొకటి ప్రారంభించి చూశాను. ఏఒక్కటీనడవలేదు. ప్రతిమచదువుదామన్నా సాగలేదు. ఏం జరిగింది? డాక్టరుగారు చదివి వుండకపోతే నేను ప్రతిమకూడా ఆనందించి ఉండకపోదునా? కిటుకంతా డాక్టరుగారిలోనే ఉందా?

తలుచుకున్న కొద్దీ నాకాశ్చర్యమయింది.

నా శలవుల్లో చాలా భాగం గుంటూరులోనే ఉండిపోయాను. ఎండలు భరించలేకా, ఉన్నకొద్దిమంది చుట్టాలనూ చూడాలనిపించి బయలుదేరి వచ్చాను. తిరిగి కాలేజీ తెరిచేనాటికే గుంటూరు పోదామని మొదట అనుకున్నాను. ఎంత? ఇంకా నాలుగు రోజులు. కాని నాకు ఈ నాలుగురోజులూ కూడా డాక్టరుగారితోనే గడపాలనిపించింది. ఈ భాసుడి నాటకానువాదాలు చూస్తే ఆయన ఎంత సంతోషిస్తాడో. ఆయనచేత చదివించి వీటిని విని తీరాలి. నా సాహిత్యాభిలాష పరిపాకం చెందాలంటే ఇంకా నేనాయన శుశ్రూష చాలా చెయ్యాలి.

"బాబాయి, ఈ పుస్తకము నాకో నెల రోజుల పాటిస్తావా?" అన్నాను.

"ఏమిట్రా అదీ? భాసుడా? నీ కిష్టమేమిటీ? కాళిదాసో, భవభూతో చదవక భాసుణ్ణి పట్టుకున్నావేమిటి. కాళిదాసు మెచ్చిన నాటక కర్తే అనుకో కాని కాళిదాసు ముందర ఏపాటి?" అన్నాడు బాబాయి.

ఎందుచేతనో డాక్టరుగారు భాసుడి పేరు వెంట కాళిదాసు పేరు ఉచ్చరించనైనా లేదు. బాబాయి తెలీనివాడనటానికీ లేదుమరి.

ఆ రోజే వెళతానంటే మా పిన్ని కోప్పడింది. మర్నాడు బస్సు పట్టుకుని గుంటూరు చేరుకున్నాను. చిదానందం విషయం విచారిస్తే వాడింకా వాళ్ళ ఊరునుంచి తిరిగి రాలేదని తెలిసింది. వాడు బ్రాడీపేటలో వాడి పెత్తండ్రి కొడుకింట ఒక గదిలో ఉండేవాడు. వాడు పాసయాడు కాని బియ్యే చదువుతాడో, మెడికల్ కాలేజీకి పోతాడో, బియ్యే చదివినా గుంటూరులో చదువుతాడో లేదో ఏమీ తెలియలేదు. వాడి పెత్తండ్రి కొడుకు రాఘవరావుకు వాడు ఉత్తరం కూడా రాయలేదుట. నా చేతిపెట్టె, బెడ్డింగూ రాఘవరావుగారింటనే పారేసి, నా పాత

గదికి వెళ్ళాను. ఆ గది కాస్తా ఇంకెవరో ఆక్రమించేశారు. మళ్ళీ నెల లోపుగా తిరిగి వస్తున్నానని తెలిసికూడా ఒక్కనెల అద్దె దగ్గిర పీనాసిగా ప్రవర్తించటం నాకే బెడిసి కొట్టింది.

అక్కడినుంచి డాక్టరుగారింటికెళ్ళాను. భాసుడి నాటకాలతో సహా. డాక్టగారు నన్ను చూసిచాలా సంతోషించాడు, భాసుడి నాటకాలు చూసి ఇంకా సంతోషించాడు.

"భేష్,భేష్! దీని కోసం ట్రై చేశాను దొరకలేదు," అన్నాడాయన.

మాటల సందర్భాన ఆయన చెప్పాడు — చిదానందం విశాఖపట్నం మెడికల్ కాలేజీకి అప్లికేషన్ వేశాట్ట. సీటు వచ్చిందీ లేనిదీ ఆ ఉత్తరంలో వాడు రాయలేదుట బహుశ సీటు వస్తుందనీ, చిదానందం మెడిసిన్ చదువుతాడనీ డాక్టరుగారన్నాడు

వాడు డాక్టరు కావాలని ఎందుకు నిర్ణయించి ఉంటాడు? డాక్టరుగారి ప్రభావం ఉండకుండా ఉంటుందా? అయితే డాక్టరుపైన అభిమానం ఎంతఉందో ఆక్షేపణా అంతఉంది. ప్రాక్టీసు చెయ్యటం విషయంలో ఆయనచేసిన పొరపాట్లు సవరించుకుని, తాను ఆయనకు గుణపాఠంగా తయారు కావాలన్న అభిప్రాయం వాడిలో అవ్యక్తంగా ఉండి ఉండవచ్చు.

నిజానికిదంతా నా ఊహే. కాని చిదానందంసంగతి బాగా ఎరిగున్నవాణ్ణి గనక, నా ఊహలో ఆట్టే పొరపాటుంటుందనిపించలేదు. అసలు నన్ను పట్టుకున్న సమస్య అది కాదు — డాక్టరవుదామన్ని నాకెందుకనిపించలేదూ? ఆయనలాగా కావటానికి నాలో అజ్ఞాతంగా ఏదోభయం ఉండి ఉండాలి. ఆయనకు ఉత్తరం రాయాలన్న ఆలోచనకూడా నాకు తట్టలేదు. డాక్టరుగారికి చిదానందం నాకన్న సన్నిహితుడు. సందేహం లేదు. ఆయననుగురించి ఎలాటిభ్రమలూ లేకుండానే వాడాయనను ఆరాధిస్తాడు. నేను? నాకాయనపైమంచి అభిప్రాయం ఉన్నప్పుడు చిన్నదేవుడల్లే ఉంటాడు; దురాభిప్రాయం ఉన్నప్పుడు శాపగ్రస్తుడిలాగా కనిపిస్తాడు. ఈ ద్వైతంనుంచి నేను తప్పించుకోలేకుండా ఉన్నాను. డాక్టరుగారికి సంబంధించినంతవరకు నా మనస్సు భ్రమలతోనే కూడిఉంటున్నది.

నాకు చిదానందంగాడిపైన అసూయ పుట్టుకొచ్చింది.

"చిదానందం ఇక్కడికి వస్తాడోరాడో ఖచ్చితంగాతెలిస్తే బాగుణ్ణు," అన్నాను.

"ఏం?"

"రాఘవరావుగారి నడిగి వాడిగది నేనే తీసుకోవచ్చు." అన్నాను.

"నీగది ఇంకా సౌకర్యంగా ఉంటుందనుకుంటున్నాను?"

"అది చెయ్యిజారిపోయింది."

"ఓ...నీ కభ్యంతరం లేకపోతే మాఉత్తరపుగదిలో ఉండొచ్చు: నాక్కూడా మంచి కంపెనీగా ఉంటుంది," అన్నాడు డాక్టరుగారు,

ఇటువంటిసూచన ఆయననుంచి వస్తుందని కలలోకూడా అనుకునిఉండకపోవటంచేత నేను చాలా బిడియపడిపోయాను. నెట్ డిసిషన్ ఆయన సూచనను ఆమోదించరాదనే. ఆ క్షణంలో ఆయన సూచన ఆమోదించటానికి ఒక్క కారణమూ కనిపించలేదు — కనిపించదగిన కారణం ఒకే ఒకటి: ఆయన కంపెనీ. కాని అదే నా కిష్టంలేదు. ఇంతవరకూ ఉన్నపరిస్థితిలో మా ఇద్దరిమధ్యా ఉంటూ వస్తున్న సంబంధం నాకు చాలా తృప్తికరంగాఉన్నది. ఎప్పుడైనాకలుసుకుంటాం, మాట్లాడుకుంటాం — కనీసం ఆయన మాట్లాడితే వింటాను; సంభాషణ బాగుందా, తృప్తిగా వెళ్ళిపోతాను; మరో సమావేశం కోసం ఆత్రంగా ఎదురు చూస్తాను. సంభాషణ రుచించకపోతే ఏదో ఒకవంక పెట్టి నేను శలవు పుచ్చుకోవచ్చు. (ఇట్లా ఒకటి రెండుసార్లు జరిగిందికూడానూ.)

అస్తమానమూ ఇద్దరమూ ఒకేచోట ఉంటే ఈ సంబంధం పూర్తిగా మారిపోక తప్పదు. తృప్తికరంగా ఉన్న సంబంధంలో మార్పే వస్తే అది అసంతృప్తికరమైనది కావటానికే ఎక్కువ అవకాశం ఉంది. అందువల్ల నాకు నష్టం.

అది అటుంచి ప్రస్తుతం మేం ఒక విధమైన గురుశిష్యులం. మా మధ్య ఉన్న బంధం చాలావరకు సాహిత్యానికి సంబంధించినది. రేపు నే పి ఇంటనే ఉండటం ఆరంభిస్తే. డాక్టరుగారి ప్రవర్తన పెళ్లాం పట్ల ఎలా ఉండేదీ, కూతురి పట్ల ఎలా ఉండేదీ, ఇంటికి వచ్చే పొయ్యే వాళ్ళపట్ల ఎలా వుండేదీ చూడకతప్పదు. ఆయన దేవుడేంకాదు. ఆయనలో వంద దౌర్బల్యాలుండవచ్చు. అప్పుడప్పుడూ వచ్చిపోతుంటేనే ఒక్కొక్కసారి ఆయనకు దూరంగా పారిపోదా మనిపిస్తుంది. అటువంటి పరిస్థితిలో రోజూ పొద్దునా, సాయంకాలమూ, రాత్రీ ఆయనను చూస్తుంటే ఎలాటి దురభిప్రాయాలైనా కలగవచ్చు. ఆ తరవాత ఆయన సాహిత్యప్రియత్వం కూడా నాకు రుచించకపోవచ్చు

మిగిలిన చిక్కులు అంత పెద్దవికావు. గదికి అద్దె ఇవ్వాలి. ఆయన అడిగినంత ఇవ్వాలి. అది ఎక్కువనిపించవచ్చు: బేరమాడటం చండాలం. తక్కువనిపిస్తే మొహమాటంగా ఉంటుంది. కాలేజీకి జీతం కట్టినట్టుగా నెలనెలా, "ఇదిగోనండీ అద్దె!" అనటం బాధే. కాని ఇవన్నీ అంత పెద్ద

బాధలు కావు.

ఆయన సూచనకు నే నెగిరి గంతెయ్యక పోవడం గమనించి ఆయన, "ప్రస్తుతం నీ సామా నెక్కడ?" అన్నాడు.

"చిదానందం వచ్చిఉంటాడనుకొని రాఘవరావుగారింటికెళ్ళి అక్కడే పెట్టాను. ఆతరువాత నా గదికి వెళ్ళిచూస్తే అందులో ఎవరో ఉన్నారు," అన్నాను.

"సరే, చిదానందం వచ్చేదీ రానిదీ తరవాత చూసుకోవచ్చు. నీ సామా నక్కడెందుకూ? ఇక్కడికి పట్టుకొచ్చెయ్యి. రెండుమూడు రోజుల్లో ఏదో ఒకపెర్మనెంటు ఏర్పాటు చేసుకోవచ్చు." అన్నాడాయన.

అందులో అబద్ధ మేమీలేదు. మరో అరగంటకల్లా నా పెట్టే, బెడ్డింగూ తెచ్చి డాక్టరుగారింట చేర్చాను. ఈ లోపల ఎవరో వచ్చి డాక్టరుగారిని పిలుచుకు పోయారుట. ఆయన భార్య నన్ను చూడగానే, "ఆగదిలో మీ సామాను పెట్టుకోండి, గది ఖాళీయే," అన్నది.

ఉత్తరపువేపు గది నిజంగానే ఖాళీగా ఉన్నది. ఊడ్చినట్టు శుభ్రంగా ఉన్నది. నేను వెళ్ళివచ్చేలోపల గది ఖాళీ చేశారో లేక అందులో ఎప్పుడూ ఏ సామానూ లేదో, అదిమాత్రం నాకు తెలీదు. నేనెప్పుడు డాక్టరుగారింటిలోపలికి వెళ్ళలేదు: ఇదే మొదలు.

నా వెనకాలే డాక్టరుగారిభార్య సుందరమ్మగారూ, కూతురు, నర్సూ గదిలోకి వచ్చి నేను నా సామాను సర్దుకోవటం సినిమా చూసినట్టు చూడసాగారు. పాపం, వాళ్ళు పరాయివాళ్ళ నిత్యచర్యలు చూసి ఎన్నేళ్ళయిందో! నేను నా షేవింగు సామానూ, టూత్ బ్రష్షూ, పేస్టూ, నా తలనూనే, దువ్వెన్నా, అద్దమూ మొదలైనవి గదిలో ఉన్న చిన్న అలమారులో పెట్టుకున్నాను. అడుగు అరలో పుస్తకాలు — వాలగ్గైదు కన్నా లేవు. — సర్దుకున్నాను.

ఎవరో చెప్పినట్టుగా నర్సు అవతలికి వెళ్ళి ఒక పాత చాప తెచ్చి ఒక గోడప్రక్కగా పరిచి, "పరుపు దానిమీద పెట్టుకోవచ్చు," అన్నది.

"స్నానం చేస్తారా? ఈలోపుగా ఆయన తిరిగొస్తారు. భోజనం చెయ్యొచ్చు," అన్నది సుందరమ్మగారు.

భోజనమా? నేను ప్రస్తుతం అతిథి నన్నమాట! తరవాత అద్దెవాడుగా మూళ్ళా? ఘోరం!

డాక్టరుగారు తిరిగిరావటానికి దాదాపు ఒక గంట పట్టింది.

"రాచపుండు కేసు...మీ రన్నం తినక పోయారా? ఆపరేషన్ చేసి వచ్చాను. అన్నం సయించదు," అన్నా డాయన.

నిజంగానే ఆయన మామూలుగా భోజనం చెయ్యలేదు. ఒక డిషల్ మజ్జిగ అన్నం కలిపి పెట్టించుకుని చంచాతో తిని లేచాడు. నాకు మామూలుగా భోజనం చెయ్యటాని కెందుకో పట్టిచ్చినట్టయింది.

"మా వంట బాగా సయించినట్టులేదు. అదేం భోజనం?" అన్నది సుందరమ్మగారు.

"వంటా? అద్భుతంగా ఉంది. హోటల్లో తినేవాడికి నాకు ఇంటివంట బాగుండకపోవట మేమిటి?" అన్నాను.

"మరి అదేం తినటం?"

"పొద్దున టిఫిను కొంచెం హెవీగా వేశాలెండి," అన్నాను.

అన్నం తినగానే గదిలో పక్కపరుచుకుని ఒక నిద్రతీశాను. ఆ రోజు మరీ వేడిగా ఉన్నట్టనిపించింది.

ఆ సాయంకాలం పాకలో కూర్చుని డాక్టరుగారు భాసుడిమధ్యము 'చదువుతూంటే నేను వింటూ, అందులో ఉన్న హాస్యాన్ని తెగ అనుభవించాను. చిత్రం! ఆ నాటకం నేను సొంతాన చదవలేక దాటేసిన నాటకాలలో ఒకటి. అది చిన్ననాటకం — నాటిక. అటువంటి నాటకాన్ని వ్యాయోగమంటారుట.

డాక్టరుగారు నాటకం పూర్తిచేసి, క్లాసుకు పాఠం చెబుతున్నట్టుగా, "భాసోహాసః" అని! ప్రతిమలోనే విషాదఘట్టంలో రాముడి చేత హాస్యంగా మాట్లాడించినవాడు హాస్య నాటిక రాస్తే ఏం చేస్తాడో మనం ఊహించవచ్చు. స్టీఫెన్‌లికాక్ హాస్యంమీద ఒక పుస్తకం రాస్తూ పందొమ్మిదో శతాబ్దికి పూర్వం నిజమైన హాస్యం లేదనేశాడు. మధ్యమలో ఉన్నది హాస్యంకాదా! షేక్‌స్పియర్ హాస్యం అతడికి నచ్చకపోవచ్చుగాక, కాని ఈ ఘటోత్కచుడు —"

మాట పూర్తిచెయ్యకుండా డాక్టరుగారు తనలో తాను నవ్వుకున్నాడు.

"ఏమిటి?" అన్నాను.

"ఈ ఘటోత్కచుణ్ణి చూస్తే మానాన్న గుర్తొచ్చాడు. వీడు ఆర్యసంస్కారం తెచ్చిపెట్టుకున్న రాక్షసుడు. వాళ్ళమ్మ ఏకాదశి ఉపోషంఉండి ద్వాదశి పారణకు తెమ్మన్నది మనిషిని. వాడు ఆ మనిషిని అడగటంలో ఎంతవినయం! వాడిలో ఎటువంటి మాతృభక్తి! ఈ ఇన్‌కాంగ్రుయిటీ ద్వారా భాసుడు హాస్యం పుట్టించాడు. మా నాన్నలోకూడా ఇటువంటి ఇన్‌కాంగ్రుయిటీ ఉన్నది. ఆయ నడబ్బు సంపాదించినది క్రిమినల్సుని డిఫెండుచేసి. ఆయన హంతకుల తరపునా, దొంగల తరపునా వాదించాడు. చాలాసార్లు నెగ్గాడు. నెగ్గకపోతే నీకు క్రిమినల్లాయరులా ఖ్యాతిరాదు. ఒక్కమర్డరరుకు శిక్ష పడకుండా తప్పించావో నీ ప్రాక్టీసు ఆకాశ మంటుతుంది. మా నాన్న కనీసం

(మిగతా 50 వ పేజీలో)

# పంచతంత్రము

ప్రపంచప్రఖ్యాతిని గాంచి, ప్రపంచభాష లన్నింటిలోను అనువదింపబడిన యీ గ్రంథమును "విష్ణుశర్మ" అను నీతిశాస్త్ర పండితుడు రాజకుమారులకు నీతిని బోధించుటకై సంస్కృతభాషలో రచియించెను. ఇందలి కథలు భారతీయరీతిని, నీతిని దెలుపు నమూల్యరత్నములు. ఇందు "మిత్రభేదము, మిత్రసంప్రాప్తి, కాకోలూకీయము, లబ్ధప్రణాశము, అపరీక్షితకారిత్వము" అను నైదుతంత్రములు గలవు. విష్ణుశర్మ, చిన్నచిన్న కథలద్వారా ప్రతిదినము మనకు ఉపయోగించుధార్మిక, ఆర్థిక, రాజనైతిక విషయములను మిక్కిలిసుందరముగా బోధించినాడు. ఇందలిపాత్రలు పశుపక్ష్యాదు లైనను మానవజాతి కంతటికిని నిత్యోపయోగములగు విషయములు ఆ జంతువులముఖమున నీ గ్రంథమునందు దెలుపబడినవి. ఇట్టి ఉత్తమకథలను మేము మన "ఆంధ్రప్రదేశ్" పత్రికలో ప్రతినెల ఒక్కటొక్కటిగా ఈనెలనుండి ప్రచురించుచు పాఠకులకు అందించుచుందుము.

— సంపాదకుడు

దక్షిణదేశములో "మహిళారోప్యము" అను నొక పట్టణము ఉండెను. దానిలో ఆ దేశమును పాలించు "అమరశక్తి" అను రాజు ఉండెను. అతడు యాచకుల కోర్కెలను తీర్చుటలో, కల్పవృక్షము వంటివాడు. ఆ రాజుకు "బహుశక్తి" "ఉగ్రశక్తి" "అనంతశక్తి" అను పేరులుగల ముగ్గురు కొడుకు లుండిరి. వారు పరమమూర్ఖులు. చదువుసంధ్యలు లేకుండా తిరుగుచుండిరి. వారిని చూచి రాజు మిక్కిలి విచారపడి మంత్రులతో "వివేకశూన్యులైన పుత్రులు నాకు ఉండుటచేత గొప్ప రాజ్యము ఉన్నను మనస్సుకు సుఖములేదు," అని అనెను. "ఎట్లనగా అజాతుడు, మృతుడు, మూర్ఖుడు ఈ ముగ్గురిలో మొదటి ఇద్దరికన్న మూర్ఖుడు జీవితాంతము దుఃఖము కలిగించును. మొదటి ఇరువురివల్ల కలుగు దుఃఖము అల్పమే. ఇట్టి మూర్ఖులు పుట్టుటకన్న తల్లి వంధ్యగా నుండుట మంచిది. ధనము, రూపము ఉన్నను విద్యావిహీనుడైన కొడుకు తలిదండ్రులకు దుఃఖము కలిగించును. అందముగా నున్నప్పటికిని గొడ్డుటావువల్ల ఏమి ఉపయోగము? అది బిడ్డలను ఇవ్వలేదు. పాలను పితుకజాలదు. మూర్ఖుడు విద్వాంసులలో సిగ్గుచేత తలవంచుకొనవలసినవాడగును. అట్టి కొడుకు బ్రతుకుటకంటె చచ్చుట మేలు గదా! మూర్ఖులను గన్న తల్లికిని, గొడ్రాలికిని భేదములేదు. కనుక నా పుత్రులను నీతిమంతులను చేయుటకు ఉపాయమును వెదకుడు. ఈ దేశములో నావలన జీవికను గడపుకొను పండితులు ఐదువందలమంది కలరు. మీ రందరు కలిసి నా కోరికను ఫలింపజేయుడు," అని చెప్పెను.

ఆ మాటలను విని మంత్రులు, 'మహారాజా! శాస్త్రములు అనంతములు, ఆయుస్సు స్వల్పము. కనుక శాస్త్రములన్నియు చదువుట ఈ స్వల్ప జీవితములో అసాధ్యము. కాబట్టి అన్ని శాస్త్రముల సారమును, స్వల్పకాలములో బోధించగల విద్వాంసుడు మన పట్టణములో నున్నాడు. ఆయన పేరు విష్ణుశర్మ. ఆయనకు మీ పుత్రులను ఒప్పగించుడు. తప్పక వారు విజ్ఞానవంతు లగుదురు. అని చెప్పగా విని రాజు వెంటనే విష్ణుశర్మను పిలిపించి "మహాత్మా! నా పుత్రులు మూర్ఖులుగ నున్నారు. వారిని దయయుంచి మీరునీతికోవిదులనుగా జేయుడు" అని వేడుకొని కొడుకులను ఆయనకు ఒప్పగించెను. ఆయనకు అధిక ధనమును గూడ బహుమానముగా ఇచ్చెదనని చెప్పెను. అది విని విష్ణుశర్మ "నేను విద్యను విక్రయించను. మీ కోరిక ప్రకారము మీ కుమారులకు విద్య నేర్పెదను. ఈ దినమును మీరు గుర్తుపెట్టుకొనుడు. నేటినుండి ఆరు మాసములలో వారిని అసమాన నీతికోవిదులనుగా చేసెదను. అట్లు కానియెడల నా ముఖమును మీకు చూపను. ఇది నాకొక విద్యావినోదము. నాకు ధనాశలేదు," అని గట్టిగా ప్రతిజ్ఞ చేసెను. ఆ మాటలు విని రాజు మంత్రుల యంగీకారమునుగూడ తీసికొని కుమారులను విష్ణుశర్మకు ఒప్పగించి నిశ్చింతగా నుండెను. విష్ణుశర్మ రాజకుమారులను తోడుకొనిపోయి వారికి పంచతంత్రములను బోధించెను. ఆరు నెలలలోనే వారు నీతిశాస్త్రములో గొప్ప పండితులైరి. నాటినుండి యీ "పంచతంత్రము" అను నీతిశాస్త్రము భూమండలములో ప్రవర్తిల్లెను. వేయేల?

క॥ ఏ మానవు డీనీతిని
నేమముతోఁ జదివినన్వినిన నిత్య; మతం
డీమహిఁ బరాభవంబును
నా మఘవుని నుండియైన నందు నె
యెపుడేన్?"

# మిత్రభేదము

ఒక వనమునందు సింహము, వృషభము మిక్కిలి స్నేహముతో ఉండెను. ఆ రెండింటి స్నేహమును పిసినిగొట్టు, లోభియు నైన ఒక నక్క చెడగొట్టెను. అది యెట్లనగా :

దక్షిణ దేశమునందు "మహిళారోప్యము" అను పట్టణములో "వర్ధమానకుడు'' అను వైశ్యుడు ఉండెను. అతడు వ్యాపారమును ధార్మికముగా చేసి విశేష ధనమును సంపాదించెను. ఒక నాడు రాత్రి శయనించినప్పు డతనికి "విశేష ధనమును" ఆర్జించుటకు ఉపాయములను కనిపెట్టవలెనను విచారము కలిగెను. ధనము వాణిజ్యమువలననే అధికముగా సంపాదించవచ్చును అని నిశ్చయించి వర్ధమానకుడు కొంత పాత్ర సామగ్రిని ఒక బండిలో ఉంచుకొని, దానికి "సంజీవకము, నందకము'' అను రెండు ఎద్దులను కట్టి ఒక మంచి దినమునందు వ్యాపారార్థమై మధురా పట్టణమునకు బైలుదేరెను. దారిలో ఘోరవనమునందు యమునాతీరమున సంజీవక వృషభము బురదలో దిగబడి కాలు విరిగి కూలబడిపోయెను. అట్లు పడియున్న ఎద్దునుగూర్చి చింతించుచు ఆ వణిజుడు మూడుదినములు అక్కడనే వేచిఉండెను. చివరకు విసిగి తన పరివారములో కొందరిని వృషభ రక్షణార్థమై అచ్చటనే ఉంచి ముందునకు తాను సాగిపోయెను. మరునాడు ఆ పరివారజనముగూడ ఆ ఎద్దును ఒంటరిగనే విడిచిపోయి తమ యజమానుని కలిసికొని ఆయనకు ఎద్దు చచ్చినది అని చెప్పిరి. ఆ తర్వాత అందరు కలిసి ముందుకు సాగిపోయిరి.

ఇట్లుండగా, సంజీవకము యమునా నది వాయువులచేత సేద దేరినదై తేరుకొని యమునాతీరమునందు పచ్చిగడ్డిని మేయుచు హాయిగా తిరుగుచు కొన్నాళ్ళకు అది నందీశ్వరునివలె బలిసి పూర్వస్థితికన్న మెరుగుగా తయారయ్యెను. ఆ వృషభము అట్లు యమునాతీరమునందు సంచరించుచు బిగ్గరగా రంకెలు వేయుచుండెను. ఒకనాడు ఆ వనమునకు రాజైన 'పింగళకుడు' అను సింహము నీరుత్రాగుటకు యమునకు పోయి అక్కడ ఎద్దు రంకెను విని భయపడి తిరిగివచ్చి తాను ఉన్న మఱ్ఱిచెట్టునీడను విడువక అక్కడనే యుండెను. ఆ సమీపములోనే 'కరటకుడు, దమనకుడు' అను రెండు నక్కలు చెలిమితో ఉండెను. అవి ఆ సింహము భయపడి నీరుత్రాగక తిరిగి వచ్చుటను కనిపెట్టి తమలో ఈ విధముగా సంభాషించుకొనెను.

దమ : మనస్వామి నీరు త్రాగుటకు పోయికూడ జలపానము చేయక దప్పితోనే తిరిగివచ్చి వ్యాకులత్వముతో మఱ్ఱినీడలో కూర్చున్నాడు. కారణమేమై యుండును.

కర : మిత్రమా. ఈ వ్యర్థమైన విచారముతో మనకు పని ఏమి ?

దమ : రాజాశ్రయముచేత మిత్రులకు ఉపకారము, శత్రువులకు అపకారము చేయు నవకాశము లభించును.

కర : మన మిరువురము చేతకానివారలము: కనుక మనము అనవసరముగా రాజుల వ్యవహారములలో జోక్యము కలిగించుకొనినచో మనకు అగౌరవము, అవమానము కలుగగలదు. మాటకు చెల్లుబడి ఉన్నచోటనే మాట్లాడవలెను. అప్పుడేమనమాటకు విలువ ఏర్పడును.

దమ: అట్లనకుము. సామాన్యుడు గూడ రాజ సేవ చేత ప్రధాను డగును. అది లేనినాడు ప్రధానపురుషునిగూడా ఎవరును లెక్కచేయరు. విద్య, కులము, వినయము, సంస్కారము లేనివాడైనను రాజాశ్రయముచేత గొప్పవాడగును.

కర: దమనకా. నీ యిష్ట మేమి ?

దమ: నేడు మన ప్రభువు పింగళకుడు భయపడి యున్నాడు. అతని పరివారము వారుగూడ భయపడి యున్నారు. అతని వద్దకు పోయి భయకారణము తెలిసికొని 'సంధి,విగ్రహము,యానము, ఆసనము, సంశ్రయము, ద్వైధీభావము' అను ఆరు ఉపాయములలో నొక దాని నాశ్రయించి అతనికి మేలు చేయుటకు ప్రయత్నించెదను.

కర: అతడు భయపడినాడని నీ కెట్లు తెలియును ?

దమ: దీని నొకరు చెప్పవలయునా ? స్వయముగా గ్రహింప వచ్చును. చూడుము. చెప్పినమాటను పశువులు గూడ గ్రహించును. పండితుడు చెప్పనిమాటనుగూడ గ్రహించును. బుద్ధికి పరేంగిత జ్ఞానమేకదా ఫలము. కనుక నే నిప్పుడు సింహము కడకు పోయి నా బుద్ధి కౌశలముచేత అతని భయమునుబాపి అతనిని వశపరచుకొని అతనికి మంత్రి నయ్యెదను.

కర: నీకు సేవించుట తెలియదు. కనుక ఎట్లు అతనిని వశపరచుకొనెదవు ?

దమ: నాకు సేవించుట తెలియదా ! నేను నాతండ్రి యొడిలో ఆడుకొనుచున్నప్పుడుఆయనవద్దకు వచ్చిన నీతి శాస్త్రపండితులవలన సేవాధర్మమునుగూర్చి వినియున్నాను.

కర: నీవు రాజుదగ్గరకు వెళ్ళి మొట్ట మొదట ఏమి మాట్లాడెదవు ?

దమ: పరస్పరము మాట్లాడుచున్నప్పుడు పైపైన మాటలు తోచునేకాని ఇప్పుడు ఎట్లు చెప్పగలను. నేను సమయోచితముగనే మాట్లాడెదను. అట్లు మాట్లాడనివాడు బృహస్పతియైనను అవమానము పొందునుకదా.

కర: రాజులను సేవించుట చాలాకష్టము. సర్పములవలెనే వారికిని రెండు నాలుకలు ఉండును.

దమ: అది సత్యమేకాని రాజుయొక్క భావము ననుసరించి బుద్ధిమంతుడు అతని హృదయములో దూరి అతనిని వశపరుచుకొనును.

కర: అది అభిమతమైనచో వెళ్ళుము. నీకు క్షేమము కల్గుగాక.

తరువాత దమనకుడు పింగళకుని కడకు వెళ్ళెను. వచ్చుచున్న దమనకుని చూచి-

పింగళకుడు: ద్వారపాలకునితో "నా మిత్రుడు దమనకుడు వచ్చుచున్నాడు; లోపలికి రానిమ్ము" అని చెప్పగనే ద్వారపాలకుడు దమనకుని లోపలికి విడిచెను. దమనకుడు లోపలకు వెళ్ళగా సింహము అతనిని ఆదరించి "క్షేమమా? చాలాకాలమునకు కనపడినావు" అని అడిగెను.

దమనకుడు: తమరు పెద్దలు మాతో తమకు ప్రయోజనము ఉండదు. అయినను అవసరము వచ్చినప్పుడు తమకు కొన్ని విషయములను తెలుపుట ఆవశ్యకము అని వచ్చితిని. మేము తమకు కులక్రమానుగతముగా వచ్చుచున్న భృత్యులము. తమకు చిక్కులు కలిగినప్పుడు మా సేవక ధర్మముల నెరవేర్చుట అవసరమని వచ్చినాను. నేను నివేదించు మాటలను చిత్తగించగలరు. నక్క ఏదో చెప్పుచున్నదని నిర్లక్ష్యము చేయకుడు.

పింగ: నీవు మా మంత్రిపుత్రుడవు, మాకు ఆప్తుడవు, చెప్పవలసినదేదో చెప్పుము.

దమ: అది రహస్యము. ఒంటరిగా నివేదించెదను.

పింగ: (సభాసదులను బయటకు పంపెను).

దమ: తమరు నీరు త్రాగుటకు నదికి వెళ్ళి త్రాగకయే తిరిగి ఏల వచ్చితిరి ?

పింగ: (సిగ్గుతో నవ్వి) "యేమియును లేదు.

దమ: దేవర ఆ విషయము నాకు చెప్పకూడనిది అయినచో చెప్పకుడు.

పింగ: (మనస్సులో ఈతడు యోగ్యుడు. నా అభిప్రాయము ఇతనికి చెప్పెదను.) దమనకా! దూరముగా వినపడు పెద్ద శబ్దము వింటివా ?

దమ: స్వామీ! విన్నాను, అయితే యేమి?

పింగ: నేను ఈ వనమును విడిచి వెళ్ళ దలచుకున్నాను.

దమ: ఎందులకు ?

పింగ: ఇప్పుడు మన వనములో ఒక అపూర్వమైన జంతువు ప్రవేశించి బిగ్గరగా అరచుచున్నది. ఆ శబ్దమునకు తగినరూపమే దానికి ఉండియుండును.

దమ: శబ్దమును వినినంత మాత్రముచేత భయపడుట యుక్తముకాదు. పూర్వమునుండి నివాసమైన వనమును విడుచుట సరికాదు. ఎన్నో శబ్దములు అడవిలో వినబడుచుండును. ధీరులు భయంకరవస్తువులను చూచినప్పుడుకూడ ధైర్యము వీడరు. కనుక ధైర్యము తెచ్చుకొని యీ ధ్వనికి మీరు భయపడకుడు. పూర్వమొకప్పుడు నేను ఒక పెద్ద శబ్దమును విని భయపడి దగ్గరికి వెళ్ళిచూడగా అది కేవలము చర్మము, కొయ్యతో నిర్మితమయిన ప్రాణము లేని వస్తువుగా నుండెను. కనుక శబ్ద మాత్రముచేత భయము చెందకుడు.

పింగ: ఆ కథ తెల్పుము.

(సశేషము)

---



'నువ్వు కనిపెట్టే మందులకంటె నేనొక మంచిపద్ధతి కనిపెట్టేను తలకాయినెప్పి తగ్గడానికి' —

సీరియల్

# బతికిన కాలేజి

పాలగుమ్మి పద్మరాజు

## 2

బ్రిట్కాలోంచి మొట్టమొదట దిగింది పట్టు. దిగడ మేమిటి, అల్లా నిలబడిపోడ మేమిటి అతని వెనకాల బండి దిగిన అతని అమ్మా నాన్నా వరో పెద్దమనిషీ అతన్ని ముందుకి నడిపించుకుపోతున్నట్టుకూడా అతనికి తెలియదు.

అంత సేపూ అతనికళ్ళు, అరుగుమీదున్న అద్భుత దృశ్యాన్ని రెప్పవెయ్యకుండా చూస్తూన్నాయి.

అరుగుమీది అద్భుతదృశ్యం రాధ. ఆమె చేతిలో పుస్తకం ఉంది. దాని అట్టమీద ఉల్లిపొర దుస్తులమాటునుంచి విచ్చలవిడిగా పెరిగిన ఒక అమ్మాయి అవయవాలు ఘాటైన రంగుల్లోతొంగిచూస్తున్నాయి. రాధ ఆ పుస్తకం చదువుతూ ఇటూ అటూ పచారు చేస్తోంది. పొరబాటు, అరుగుమీద జారుతోంది — లేదు, ప్రవహిస్తోంది. అసలాకను వర్ణించడానికి మాటల్లేవులెండి.

కాళ్ళు గాలిలోనే ఎక్కువసేపు తేలి కదులుతున్నాయి. అప్పుడప్పుడు అరుగుని పరామర్శించడానికి దాన్ని తాకుతున్నాయంతే, అసలవి కాళ్ళు అనడానికి వీల్లేదు. ఏ అజంతాశిల్పో తన బొమ్మకి ప్రాణంపోసి అరుగుమీద పెట్టాడు. పుస్తకాన్ని పట్టుకున్న చేతులు మెత్తని కెరటాల్లాగ లేచి వాలుతున్నాయి, ఒకచెయ్యి పైకి వంగితే రెండో చెయ్యి కిందికి వంగుతూ, ఏదోద్రవపదార్థంతో చేసినట్టు కదులుతున్నాయి. అయితే రాధకు తను నాట్యం చేస్తున్నట్టు తెలియదు. ఆమె చదువుతున్న నవలలోఘట్టం అలాంటిది. అది వంపుతిరిగి ఆమె శరీరంలో వ్యక్తమైంది. అబ్బ, ఎటువంటి ఘట్టమది!!

"నా హృదయకుసుమాన్ని నీ పాదాలవద్ద ఉంచుతున్నా," అన్నాడు ప్రియుడు.

"నా ప్రేమసామ్రాజ్యానికి చక్రవర్తివి నీవు," అంది ప్రేయసి.

ఈ భావలో మాటాడుకుంటూ ఇద్దరూ ఒకరికొకరు దగ్గరగా వస్తున్నారు. వారి కదలిక మీకు కనబడదు. అంత మెల్లగా, చేరువౌతున్నారు. అనుక్షణం ఒకటైపోతున్నారు. ఇద్దరిగుండెలూ ఒకటై స్పందిస్తున్నాయి. ఆస్పందించేగుండెరాధది. ఆ గుండెతో ఆమె ఆ పాదమస్తకం స్పందించింది. ఆ స్థితిలో ఆమె ఉన్నప్పుడు, ముగ్గురు వృద్ధులూ ఒక యువకుడూ తనవంక రెప్ప వాల్చకుండా చూస్తున్నారని ఆమె కెల్లా తెలుస్తుందిపాపం?

ముగ్గురు వృద్ధులూ కొంచెం గొణుక్కుంటున్నా, అది ఆమెకు వినపడే సావకాశం లేదు. యువకుడు అసలు మాటలే మరచిపోయాడు.

అరుగుమీద ఆమె నాట్యం, అరుగుకింద వాళ్ల తెరుచుకున్న నోళ్ళు. ఈ ప్రతిష్టంభన ఎంతసేపైనా ఇలాగ సాగేదే. అదృష్టవశాత్తూ ఒక చిన్న ప్రమాదము జరిగి అది భగ్నమైంది. ఆ ప్రమాదం పట్టూ ముందడుగు వెయ్యడం. మతిపోయినట్టు నడుస్తున్న పట్టూని, ఇదే సమయమని, ఒక కొంటె ఇటుక బోల్తాకొట్టించింది. ముందుకి వేస్తున్న అతడి కాలికి అడ్డుతగలడమే గాక, అతడి తన్నుతో ముందుకిసాగి కిందపడిన అతన్ని పొట్టలోనూ, ఛాతీమీదా క్రూరంగా పొడిచింది కాని ఆ బాధకూడా అతనికి తెలియదు. పడిపోతున్నప్పుడూ, పడిపోయాకా కూడా అతని చూపులు అరుగుమీదున్న అద్భుత దృశ్యాన్నించి వదలలేదు.

అప్పుడామె అతన్ని చూసింది అతడు ఆమెనుచూచుచు ఒక క్షణంపాటు కాలం నిలిచిపోయింది. ఆ తరువాత చంద్రుని ఎగిరిపోయింది. కాలం కాదు; ఆమె — ఇంటిలోపలికి

పడిఉన్న పట్టూకి కనబడ్డవి మెరుపుల్లాంటి రెండుకాళ్ళు, ఎగిరిన జడమీది తళ తళ, చెక్కులమీది లేతగులాబులు, విచ్చుకున్న పెద్దకళ్ళలో సిగ్గూ ఆశ్చర్యాల వింత వెలుగున్నూ. ఎవడో మంత్రకాడు దండం విసిరితే మాయమయి పోయినట్టు అరుగుమీది దృశ్యం అంతర్ధానమైపోయింది. అరుగుమీద మిగిలింది శూన్యం.

అప్పుడు గ్రహించాడు పట్టూ. తన డొక్కలో ఇటుక దౌర్జన్యంగా పొడుస్తోందని. పట్టూ లేచాడు.

అసలు పట్టా ఎవరో అతడు సరిగ్గా ఆ సమయానికి అక్కడికి రావలసిన అగత్యం ఏమిటో — ఇప్పుడు కాస్త వ్యవధి దొరికింది గనుక వివరిస్తాను.

ఇంతవరకూ అతన్ని పట్టూ అని పరిచయం చేశాను. అసలు తలిదండ్రులు పెట్టినపేరు పట్టాభిరామారావు. కాలేజీ పుస్తకాలన్నిటిలోనూ అదే పేరుంది. పట్టూ ముద్దుపేరూ బిరుదూకూడా. ఆ బిరుదు ప్రపా

దించింది అతని ప్రాణస్నేహితుడు మిస్టర్ చింతా. కాలేజీలో అతని సహాధ్యాయికూడా. సన్నగా, పొడుగ్గా, చట్రంలేని కళ్ళద్దాలూ, చాకులాంటి మడత నలగని పాంటూ, సీమ చుట్టా, సింగపూర్ చేతికర్రా, అతనూ అతికులాసాగా, జీవితాన్ని ఒక ఆటలాగ పరిగణిస్తూ సాగిపోతుంటాడు మిస్టర్ చింతా. అతని తల్లిదండ్రులు అతనికి యుక్తవయస్సు రాగానే, పెద్ద ఆస్తి అతని చేతిలో పెట్టి, మర్యాదగా చచ్చిపోయారు. అందేత జీవితాన్ని అనుభవించటానికి అతనికి తల్లిదండ్రులవంటి అడ్డంకులేవీ లేవు.

చింతా–అన్న అతని ఇంటిపేరు. ఒక్క దక్షిణభారతదేశంలో తప్ప, మిగతా నాగరిక ప్రపంచంలో అంతటా మనిషికి ఇంటిపేరు పెట్టేపిలుస్తారు. అందేత అందరూ తనను మిస్టర్ చింతా అని పిలవాలని అతడు నిర్ణయించాడు. ఆ పేరుతో పిలిస్తేనే అతడు పలుకుతాడు. మిస్టర్ చింతాని గురించి మీరు ముందుముందు చాలా వింటారు గనక (అసలు మీరు మిస్టర్ చింతాని ఎల్లా తప్పించుకోగలరు?) ప్రస్తుతం ఈ ఉపోద్ఘాతంతో అతని ప్రస్తావన ముగించి, కథలోకి వద్దాం.

మన యువకుణ్ణి పట్టూ అని పిలవటానికి మిస్టర్ చింతా రెండు కారణాలు చెప్పాడు. ఒకటి, పట్టు – బట్టల్లో శ్రేష్ఠమైనది, నునుపైనది, మెరిసేది. మన యువకుడిలో ఒకటి – మూడు లక్షణాలు లేకపోయినా, రెండోది – అంటే నునుపు – అతని శరీరానికి ఉంది. రెండు, పట్టు – అనగా పెంకితనం. అది మన యువకుడికి పూర్తిగా ఉందని మిస్టర్ చింతా నిశ్చయం. అతని తల్లితండ్రీకూడా క్రమంగా పట్టూ అనే పిలవడం మొదలెట్టారు.

ఇంక అతని తల్లిదండ్రుల విషయం. వాళ్ళకి పేర్లున్నాయి. అయితే వాటిని మిస్టర్ చింతా కలుగజేసుకోలేదు గనక ఆ పేర్లు మామూలుగా చప్పగా ఉండి పోయాయి అవి రామయ్య, సుబ్బమ్మ. ఇక మూడో వృద్ధుడు పేరయ్య. పెళ్ళిళ్ళ – అనేది ఇంటి పేరు కాకపోయినా, అతని పౌరుషనామం. అతను శంకరయ్య మేనమామ భావమరిది పెళ్లాం సవితి అన్నగారికి సాక్షాత్తూ వేలువిడిచిన మేనమామ కొడుకు. అతని వృత్తి పెళ్ళిళ్ళు. తన శాఖలో పెళ్ళి కాని పిల్లలుపిల్లవాళ్ళ జాబితా ఇంచుమించు పూర్తిగా అతని దగ్గరుంది. వాళ్ళ మధ్య పెళ్ళి చూపులు ఏర్పాటు చెయ్యటం అతని జీవితాశయం.

ఇప్పుడతను పట్టూని, కల్యాణిని చూడ్డానికి తీసుకొచ్చాడు.

ఇంక తను కలుగజేసుకోకపోతే లాభంలేదని పేరయ్య చొరవ చేసి లోపలి కెళ్ళాడు. శంకరయ్యని ఇవతలికి పిలిచాడు. ఇద్దరికీ



పరిచయం చేసి, పక్కింటికి వెళ్ళాడు పెద్ద జంబుఖానాకోసం.

"దయచేయండి." అన్నాడు శంకరయ్య.

జంబుఖానా వచ్చేదాకా ఎక్కడ 'దయ చెయ్యాలో' అర్థంకాక రామయ్యా, పట్టూ అలాగే నిలబడ్డారు. శాంతమ్మ కాస్త కని కరించి మంచం దిగి గుమ్మందాకా ఈడు కుంటూ వచ్చింది. సుబ్బమ్మని లోపలికి పిలిచింది.

అసలుసంగ తేమిటంటే ఆరోజుని పెళ్లివా రొస్తున్నట్టు శంకరయ్యకీ అతని కుటుంబా నికీ తెలియదు. పెళ్ళిచూపులకు ఏర్పా టైన ముహూర్తం మరునాడు మధ్యాహ్నం మూడుగంటలకి. అంచేత ఆ సందర్భం కోసం పొరుగింటినించి కుర్చీలూ బల్లలూ ఎరువు తేవడంగాని, ఫలహారాలకు ఏర్పాట్లు గాని శంకరయ్య ఏమీ చెయ్యలేదు.

రామయ్య శంకరయ్య ఒకరి నొకరు ఎలా మర్యాద చెయ్యాలో తెలియక తికమక పడుతుండగా, పేరయ్య పెద్ద కంబళీ ఒకటి తెచ్చి అరుగుమీద పరిచాడు.

"అలా నిలబెట్టావేమిటోయి శంకరయ్యా. రామయ్య బాబూ! ఇలా కూచో. పట్టూ, దా." అంటూ అనవసరంగా నవ్వుతూ, అప్రస్తుతాలు ప్రసంగిస్తూ పేరయ్య కాస్త వాతావరణాన్ని మూసివేసిన మబ్బుల్ని తొలి గించడానికి ప్రయత్నిస్తున్నాడు

లోపల పరిస్థితి ఇంత ఇబ్బందిగా లేదు సుబ్బమ్మ సత్తెకాలపు మనిషి, మెత్తనిదీ, శాంతమ్మ గొప్పతనాన్ని ఆమె చూడగానే అంగీకరించింది. ఆమె వైశాల్యం, వంశం, వేళ్ళ వాపులు చూడగానే సుబ్బమ్మ దాసోహ మంది. సుబ్బమ్మకు పుట్టింటి వైపు చెప్పుకో దగ్గ పెద్ద లెవళ్ళూ లేరు. కల్యాణి వచ్చి సుబ్బమ్మకు దండం పెట్టింది. పక్కనే కూర్చుని రాధ కల్యాణికి జడ వెయ్యడం మొదలెట్టింది. కల్యాణిలో హుందా మంచి మర్యాదా సుబ్బమ్మకి బాగా నచ్చాయి ఆమె అడిగిన ప్రశ్న లన్నింటికీ కల్యాణి అణకు వగా సమాధానాలు చెప్పింది. ఆ తరువాత శాంతమ్మ తన అభిమాన విషయమైన, ముత్తాతగారి తాతగారి గొప్పతనం వర్ణించ డం మొదలెట్టింది. సుబ్బమ్మ కళ్ళప్పగించి వింది.

అరుగుమీద సంభాషణ కాస్త బెట్టుగా నడుస్తోంది. పేరయ్య తెచ్చిపెట్టుకుని గట్టిగా నవ్వుతున్నాడు, రామయ్యా శంకరయ్యల మధ్య బెట్టు సడలిద్దామని. నిజానికి ఇద్దరికీ సంభాషణ ఎల్లా మొదలుపెట్టాలో తోచ లేదు. రాగానే తగిన మర్యాద చెయ్యనందుకు శంకరయ్య రామయ్యకు క్షమార్పణలా కనిపించకుండా క్షమార్పణ చేప్పుకోవాలి. అనుకున్న దానికన్న ఒకరోజు ముందువచ్చి నందుకు రామయ్య మగ పెళ్ళివారి బెట్టు సడలకుండా కారణం వివరించాలి. ఆఖరికి శంకరయ్య మాటలు నములుతూ,

"ఆ. మరి... మేం... రేపు... అని మేం... మధ్యాహ్నం" అన్నాడు.

దానికి అదే భాషలో రామయ్య,

"అంటే... ఉత్తరం... బాగుండేది... అంటే... చూశారూ... ఈవేళ... నిజా నికి... అంటే రేపు..." అని సమాధానం చెప్పాడు.

పేరయ్య ఈ సందర్భంలో కలగజేసు కుని, రామయ్య మాటల్ని మరికాస్త ధారాళ మైన తెలుగులోకి తర్జుమా చేసి చెప్పాడు.

"నన్ను ఉత్తరం రాయమన్నాడయ్యా. రేపటికంటే వాళ్ళ కీవేళే వీలుగా ఉందనీ. నాకు పని తీరలేదనీ. మొన్నంతా మన సత్తిగాడి కూతుర్ని వెంకటప్పయ్య కొడుక్కు స్థిరపడడంతో సరిపోయింది. తరవాత పిచ్చెయ్య మేనల్లుడి వ్యవహారం– పాపం వాడి తండ్రిపోయి ఏడాది తిరగలేదు; పెళ్ళి వెంటనే జరిగితీరాలంటాడు గంగాధరం. ఏటిసూతకమన్నా పోవాలా వొద్దా? విన్న ఆ శేశవరావేం తేలాడు? పెళ్ళినా దిస్తానన్న కట్నం వగైరా తనకి ఎగ్గొట్టాట్ట. కొడుకు కార్యం ఆపేశాడు. సరే నే నేదో మధ్యవర్తి త్వం ఏడిసి...

శంకరయ్య ఎంతో మర్యాదగా అడిగాడు,

"రేపు బహుశా మీ కేమన్నా ఇబ్బం దేమో."

రామయ్య అతి గంభీరంగా బొమలు ముడివేశాడు.

"ఇబ్బంది ఏమీలేదు. రేపు గ్రహచారం అంత బాగాలేదు." అన్నాడు,

"ఏమిటీ?" అన్నాడు శంకరయ్య.

"జ్యోతిష్యం తెలియనివా డెవడో పెట్టుం టాడు రేపటిముహూర్తం. చంద్రుడు చూడండి......" అంటూ వ్యాఖ్యానించ బోయాడు రామయ్య.

"ఏమిటీ?" అని ఈసారి సింహనాదం చేశాడు శంకరయ్య. పేరయ్య యుద్ధసూచ నలు గుర్తించి సంధిపతాక ఎగరెయ్యడానికీ ప్రయత్నించాడు.

"ఆ...జ్యోతిషంలో ప్రతివాడిదీ తలో సిద్ధాంతమూనూ. ఏ ఇద్దరికీ పొత్తు కుదరదు." అన్నాడు.

అప్పటికప్పుడే శంకరయ్య ప్రమాదస్థితి దాటిపోయాడు.

"రేపు చంద్రుడిస్థానం బాగాలేదని ఏ వెధ వండీ అంటా?" అని రంగంలోకి దూకాడు.

"ఇంతవరకూ పట్టూ నడుస్తున్న సంభా షణ విననేలేదు. అతడు దివ్యసౌందర్యాన్ని దివ్యనాట్యాన్నీ గురించి కలలు గంటూ మరో లోకంలో ఉన్నాడు. ఎత్తుపల్లాల అరుగులూ, కుటుతున్న కంబళీ, దిగబడిపోతున్న ఇంటికప్పూ ఇవేవీ అతనికి గుర్తేలేవు. రూపం, నాదం, చలనం, సంయోగం చెం దిన "అకుల్‌రాలని పూలు వాడని వసంతా రామమధ్యమ్ములో," ఉన్నా డతడు..అక్క ణ్ణుంచి, శంకరయ్య హుంకారం అతన్ని నిర్దాక్షిణ్యంగా నేలమీద పడేసింది. తండ్రి

మాటలు విన్నాక అతనికి పరిస్థితి కొంత అర్థమయింది.

"నే నంటున్నానయ్యా చంద్రుడు నీచు డని వందసార్లంటాను. వెయ్యి సార్లంటాను."

"జ్యోతిష మంటే ఓనమాలు తెలియని వాళ్ళంతా పెద్ద పండితులై పోయారీ రోజుల్లో."

"జ్యోతిషం నీ కేం తెలుసునయ్యా?"

"నీ కేం తెలుసంట."

పేరయ్యా పట్టూ ఆ రెండు పర్వతాలూ ఢీకోకుండా అడ్డుపడ్డానికి వాళ్ళ శక్తిలోపం లేకుండా ప్రయత్నించారు. కాని వాళ్ళ ప్రయత్నాలు పిండిపిండై పోయాయి.

"నన్ను వెధవంటావురా?" అన్నాడు రామయ్య.

"నన్నవలే నువ్వు?" అన్నాడు శంకరయ్య.

"నాన్నా!" అన్నాడు పట్టూ.

"నోరుముయ్యి," అన్నాడు రామయ్య.

"శంకరయ్య!" అన్నాడు పేరయ్య.

"నువ్వుండు," అన్నాడు శంకయ్య.

ఆ తరవాత గొడవలో ధ్వనులుతప్ప మాటలు తెలియలేదు. నలుగురూ ఒక్కసారి మాట్లాడ్డంమూలంగా మాటలు అలుక్కుపోయాయి. కూర్చున్న నలుగురూ లేచారు. రామయ్యని పట్టూ పట్టుకున్నాడు. శంకరయ్యని పేరయ్య పట్టుకున్నాడు. గొంతులు జోరుగాలేచాయి శబ్దాలు గొడవల్నీ చూరునీ అదరగొట్టేశాయి. పోరు అంతకంతకి జోరైంది. ఆ సమయంలో గుమ్మంలోకొచ్చి నిలబడింది కాంతమ్మ. నిలబడ్డ మేమిటి, కెవ్వుమని అరుస్తూ అడ్డంగా పడిపోవడ మేమిటి? ఆ అర్తనాదం ప్రతికక్షు లిద్దరూ విన్నారు. ఆమె పడిపోవడం చూశారు. ఇద్దరూ నిశ్చేతనంగా నిలబడిపోయారు. రామయ్యా కొంత ముందుగా ఆ దెబ్బనించి తేఱుకున్నాడు. కాంతమ్మ పడిపోగానే ఆమె వెనకాల నిలబడ్డ సుబ్బమ్మ అతనికి కనబడింది.

"రా పోదాం." అని ఆజ్ఞాపించాడు రామయ్య.

"నాన్నా." అన్నాడు పట్టూ.

"తొందరపడకు రామయ్యా బావా." అన్నాడు పేరయ్య.

"తొందరపడిం దెవరు? నేనా? వాడా? అసలీ పాడుకొంపకి తీసుకొచ్చి వీడిచేత నన్నవమానింపచేసింది నువ్వు. అల్లా నిలబడ్డావేమిటే — రా," అని మళ్ళీ అరిచాడు రామయ్య పెళ్ళాన్ని వుద్దేశించి. కాంతమ్మ వంటి పదార్థం గుమ్మాని కడ్డంగా ఉంటే సుబ్బమ్మలాంటి అర్భకులు దాటి ఇవతల పడ్డం ఎంతకష్టమో రామయ్య కేం తెలుసు? మొత్తంమీద ఆ అద్భుతకార్యం సాధించి ఆవిడ ఇవతలపడగానే, రామయ్య పెళ్ళా నొకచెత్తోనూ, కొడుకు నింకోచేత్తోనూ పట్టుకుని మెట్లమీదుగా ఈడ్చుకుపోయాడు. అతన్ని సముదాయించడానికి పేరయ్య కొంత దూరం పరుగెత్తి, లాభంలేక తిరిగొచ్చాడు. శంకరయ్య గాలిపోయిన బుడగలాగ చప్పబడిపోయాడు. మూర్ఛపోయిన తన భార్యకి ఏదైనా చికిత్స చెయ్యాలని కూడా అతనికి తోచలేదు. జడ సగంవేసుకున్న కల్యాణి ఇవతలికి రాలేకపోయింది. అంచేత రాధ తల్లికి మామూలుగా చేసే శైత్యోపచారం చేసింది — మొగంమీద చన్నీళ్ళూ, నోట్లోకి చల్లటిమజ్జిగా, తన మూర్ఛకి కాంతమ్మ నిర్ణయించుకున్న మందులూ. ఈ ఉపచారం జరుగుతుండగా కామన్న తన గదిలోనుంచి ఇవతలికి వచ్చాడు. అసలుగొడవ ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు అతను శవాసనంలో ఉండి కదలడానికి వీల్లేకపోయింది. తన తల్లి గుమ్మాని కడ్డంగా పడిఉండడం చూసి అన్నాడు.

"శీర్షాసనం వెయ్యవమ్మా. ఈ మూర్ఛ ఇంకరాదు అంటే వింటా?" ఆవిధంగా తనబాధ్యత నెరవేర్చుకుని, తరవాత కార్యక్రమంలో ఉన్న కూర్మాసనం వెయ్యడానికి మళ్ళీ తన గదిలోకి వెళ్ళిపోయాడు.

"ఈ సంబంధం కలవదని అప్పుడే అనుకున్నా. అసలు వాళ్ళ జాతకాలు కలవందే —" అన్నాడు శంకరయ్య, తప్పు చేసిన పిల్లవాడిలాగ.

"చాల్లేవయ్యా. నీ జాతకాలూ నువ్వూను," అన్నాడు చిరాకుగా పేరయ్య. "మంచీ మర్యాదా తెలియదు పైగా జాతకాలట, జాతకాలు —"

"నిజమే పేరయ్యా, వాళ్ళ జాతకాలు.."

"నీ జాతకం ముందు నువ్వు సరిగ్గా చూసుకోవయ్యా. వాళ్ళ జాతకా లెందుకు. నీ అంతటి తెలివితక్కువ దద్దమ్మ సృష్టిలో మరొకడు ఉండడని అందులో స్పష్టంగా రాసుంది బంగారంలాంటి సంబంధం చేతులారా పోగొట్టుకున్నావు. దమ్మిడీ కట్నం పుచ్చుకోకుండా చేసుకోడానికి సిద్ధపడ్డారు వాళ్ళు. అమ్మాయికిలాంటి సమ్మంధం మరొకటి తే, చూస్తాను. అసలు వాళ్ళు పూర్వజన్మలో ఏఘోరపాపం చేసుకున్నారో నీ కూతుళ్ళై పుట్టారు."

"నిజమే పేరయ్యా, నేను చాలా తెలివి తక్కువగా..."

"చేతులు కాలాక ఆకులు పట్టుకుని ఏం లాభం? ఇంక ఏం తంటాలు పడతావో. నువ్వేపడు నా కింక ఏ సంబంధమూలేదు."

పేరయ్య వెళ్ళిపోయాడు.

మీరు రెండుమూడు సంగతులు గ్రహించి ఉంటారు. ఒకటి, పేరయ్యకి వట్టి సరదా తప్ప సంబంధాలు కుదర్చడంలో అతనికి స్వార్థం ఏమీలేదు. రెండు, శంకరయ్య ఒక్క జ్యోతిష విషయాల్లో తప్ప, ఇతర సందర్భాల్లో మేకంతసాధువు. ఇక మూడు, కాంతమ్మకి తగినంత అవసరమున్న సందర్భాలలో మూర్ఛ వస్తుంది. కిట్టనివాళ్ళు అది దొంగ మూర్ఛంటారు. అయితే అది వివాదగ్రస్తమైన విషయం.

కాంతమ్మ కొంతసేపట్లో తేరుకోక తప్పదు. ఎందుకంటే, ఆ పడిపోయినస్థితిలో తగినంత మజ్జిగ తాగడం కొంత ఇబ్బందే, అంచేత కాంతమ్మని ఆమెభర్తా, కుమార్తెలకు వదలిపెట్టి మనం మరోచోటికిపోవచ్చు.

— (సశేషం)

# తాతయ్యా తెల్లబోయాడు

—కాంతం

రవి ఎనిమిదవ తరగతి చదువుతూవుంది. ఒకరోజు రాత్రి చదువుతూ పరధ్యాన్నంగా కూర్చుంది రవి. తాతయ్య చూశాడు. "ఒసేయ్ రవీ! చదువు మాని ఏమిటే అలా చూస్తున్నావు?" అన్నాడు.

"తాతయ్యా! రేపు మా క్లాసు మాస్టరు తెలుగులో 'దిక్కులేనివారికి దేముడే దిక్కు' అనేదాన్నిగురించి మాట్లాడా లన్నారు. లేక పోతే తెలుగు మాస్టారు నా వీపంతా ఛూమంత్రం చేస్తాడు" అంది.

"అంత అపాయం ఏమొచ్చి పడిందమ్మా" అన్నాడు తాతయ్య.

"అపాయమే తాతా! ఈ తెలుగు మాస్టరు వట్టి దుర్మార్గుడు. మా తరగతి పిల్లలందర్నీ మంటల్లోకి తోసి, కాలుస్తా నన్నాడు. చింతబరికతో వీపు చిట్లగొడతా నన్నాడు. హయ్యో! మా ఎనిమిదవ తరగతి పిల్లల గతి ఏం కాను?..."

"అయ్యో పాపం!" అన్నాడు తాతయ్య ఓదార్పుగా.

"తాతయ్యా! నేను రేపు ఆ విషయం మీద మాట్లాడడానికి తయారుకావాలి. నువ్వు వెళ్ళు తాతయ్యా" అని రవి అదే ఆలోచనలో నిమగ్నమయిపోయింది.

రాత్రి రవికి సరిగా నిద్రపట్టలేదు. తెల్లవారినకొద్దీ రవి గుండెలు గడగడ లాడసాగాయి. ఎట్లాగ భగవంతుడా అని ఆలోచిస్తూనే నిద్రపోయింది.

తెల్లవారింది.

రవి స్కూలుకు వెళ్ళింది. పిల్లలంతా వచ్చి కూర్చున్నారు. గంట కొట్టారు. తెలుగు మాస్టారు యమధర్మరాజులా చక్కావచ్చాడు.

రవికి ప్రాణాలు పైనే పోయాయి. మొదటి బెంచీలో రవీ, సుశీలా, ప్రభా, ప్రేమా, లక్ష్మి కూర్చున్నారు.

మాస్టారు క్లాసు అంతా ఒకసారి పరకాయించి చూసి "రవీ! నువ్వు మాట్లాడు" అన్నారు. అప్పుడే రవి ప్రాణం పైకి పోయింది. కాళ్ళు, చేతులువణికిపోతున్నాయి. అలాగే మాస్టారు వున్న బల్లదగ్గరకు వెళ్ళింది. కాని నోటమాట పైకి రాలేదు. ఎలాగో మాట్లాడింది. ఆ తర్వాత మరికొంతమంది మాట్లాడారు.

సరీగ్గా అప్పుడే స్కూలు బంట్రోతు హెడ్ మాస్టరుగారివద్దనుంచి వచ్చి, తెలుగు మాస్టరుగారైన ఆ యమధర్మరాజుగారికి ఒక కాయితం ఇచ్చాడు. అది చదువుకొంటూ గబగబా బైటకు వెళ్ళిపోయారు ఆయన.

మేష్టారు ఆ కాయితం తీసుకొని వెళ్తూ వుంటే ఆయన ముఖం అంబాజీపేట ఆముదం తాగినవాడి ముఖంలావుంది. దానిని బట్టి ఆయనకు ఏదో కష్టం కలిగిందని అనుకొంటూ బల్లదగ్గరకు వెళ్ళికూర్చుంది రవి. ఇంతలో గంటకొట్టారు. బ్రతుకుజీవుడా అని అంతా బైటపడ్డారు.

మర్నాడు పదవతరగతి చదువుతున్న రవి స్నేహితురాలు వరలక్ష్మి వచ్చి, రవిని బయటకు పిలిచి చెవిలో నింపాదిగా "ఒసేయ్ రవీ! మీ తెలుగు మాస్టారుకు బదిలీ అయిందట" అని చెప్పింది.

ఆ సంతోషమైనసంగతిని రవి క్లాసులోని స్నేహితురాళ్ళందరికీ గట్టిగా చెప్పింది. అప్పుడువాళ్ళంతా ఆనందంతో గంతులు వేశారు. కేకలువేశారు. పాటలు పాడారు.

మూడవనాడు తెలుగుమాస్టారు యింక రారని అంతా క్లాసులో అల్లరిచేస్తూ వుండగా యమధర్మరాజులా వచ్చాడు మా తెలుగు మాస్టారు!

మాస్టారు కుర్చీలో కూర్చోకుండా బల్ల దగ్గర నిలబడి "మొన్న తెలుగుక్లాసులో మాట్లాడినందుకు రవికి ఫస్టు ప్రయిజు వచ్చింది" అన్నారు.

రవి ఆనందంతో ఉక్కిరి బిక్కిరయ్యింది.

కన్నీళ్ళుకూడా వచ్చాయి. ఏడుపుకాదది. ఆనంద బాష్పాలంటారే — అవి.

మేష్టారు వెళ్ళిపోయారు.

ఆవెనకనే రవి వెళ్ళింది.

"మాష్టారూ!" అని పిలిచింది. ఆయన ఆగిపోయారు. దగ్గర కెళ్ళి "మాష్టారూ! మీరు చాలా మంచివారండీ. నన్ను క్షమించండి" అంది.

రవి ఎందుకు అలా అన్నదో మాష్టారుకు అర్థంకాక తెల్లబోయారు. అయినా ఓక్షణం తర్వాత ఆయన తేరుకుని "నువ్వు మంచి దానివమ్మా. బాగాచదివి పైకి రావాలి," అంటూ ఆప్యాయంగా తల నిమిరి వెళ్ళిపోయారు.

రవి ఆరోజు యింటికి రాగానే తాతయ్య దగ్గరకి పరుగెత్తుకెళ్ళి "తాతయ్యా! మా తెలుగు మాస్టారు చాలా మంచివారు తాతయ్యా" అంది.

తాతయ్య తెల్లబోయాడు. ✻



కరీంనగర్‌లో మార్చి 26 వ తేదీన ఎస్. ఆర్ ఆర్. కళాశాల కొత్త భవనానికి శంకుస్థాపన చేస్తున్న ముఖ్యమంత్రి.



కరీంనగర్‌లో మార్కెటింగ్ సొసైటీ భవనానికి మార్చి 24 వ తేదీన శంకుస్థాపన చేస్తున్న ముఖ్యమంత్రి.



హైదరాబాదు. మోయిన్ బాగ్ వద్ద మార్చి 16 వ తేదీన సీనియర్ సర్టిఫైడ్ పాఠశాలకు ప్రారంభోత్సవం చేస్తున్న ముఖ్యమంత్రి



పట్టణ ప్రాంతాలలో బాలనేరాల సమస్యలు అన్న విషయంపై ఏర్పాటయిన సదస్సులో న్యాయ, జైళ్ళ శాఖామంత్రి శ్రీ పి. వి. నరసింహారావు ప్రసంగిస్తున్న దృశ్యం.



జూబ్లీహాలులో మార్చి 25 వ తేదీన జరిగిన నెహ్రూ స్మారకనిధి తాలూకు ప్రాంతీయ ఉపసంఘం తొలిసమావేశం.



నెహ్రూ స్మారకనిధి ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయోపసంఘ ఉపసంఘ సమావేశం మార్చి 31 వ తేదీన శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి అధ్యక్షతన జరిగినప్పటి దృశ్యం.



సనత్‌నగర్‌లో ఏప్రెలు 2 వ తేదీన ఇండియన్ ఆక్సిజన్, అసెటిలీన్ ఫ్యాక్టరీకి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేసినప్పటి చిత్రం.



ఇండియన్ ఆక్సిజన్, అసెటిలీన్ ఫ్యాక్టరీ దృశ్యం.




హనుమకొండ కిరాణవర్తకుల సంఘానికి మార్చి 23వ తేదీన సమాచారశాఖ మంత్రి ప్రారంభోత్సవం చేస్తున్నప్పటి చిత్రం.



ఇబ్రహీంపట్టణం బ్లాకులోని డబిల్ గూడాలో వ్యవసాయకూలీల నిమిత్తం ఏర్పాటు చేయబడిన ఒకరోజు పాఠశాలకు మార్చి 26వ తేదీన కార్మికశాఖా మంత్రి శ్రీబి. వి. గురుమూర్తి ప్రారంభోత్సవం చేస్తున్నప్పటి చిత్రం.

బ్రిటిష్ - అమెరికన్ సంస్థ ఉపనాయకుడు డా॥ బి. యల్. జోన్స్ మార్చి 17 వ తేదీన ముఖ్యమంత్రిని కలుసుకొని ముచ్చటిస్తున్న దృశ్యం





ఉగండా దేశపు విద్యాశాఖామంత్రి డా॥ జేక్‌కు బీగంపేట విమానాశ్రయంలో ఏప్రెల్ 4 వ తేదీన స్వాగత మిస్తున్న రాష్ట్ర పంచాయతీరాజ్ మంత్రి డా॥ ఎమ్. ఎన్. లక్ష్మీనరసయ్య.



వరంగల్లులో మార్చి 23 వ తేదీన 'సేఫ్టిరెస్ పుల్లింగు' పోటీలో గెలు పొందినవారికి బహుమతులు అంద జేస్తున్న కార్మిక, సమాచార శాఖా మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి.



రాజేంద్రనగర్ సమితిలోని నరసింగి వద్ద మూడు రోజులపాటు జరిగే కుటుంబ నియంత్రణ తాలూకా ఓరియంటేషన్ శిక్షణ శిబిరానికి మార్చి 29 వ తేదీన పంచాయతీరాజ్ శాఖామంత్రి డా. ఎమ్. ఎన్. లక్ష్మీనరసయ్య ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం. హైదరాబాదుజిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ. ఎమ్. భోజ్ రెడ్డి అధ్యక్షత వహించారు.



పంచాయతీరాజ్ మంత్రి మార్చి 19 వ తేదీన చేవెళ్ళలో గ్రామ సహాయకుల శిక్షణ శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు.



రాష్ట్ర సమాచార కేంద్రం, రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో ఏర్పాటు చేసిన లేఖారచన పోటీలో గెలుపొందినవారికి బహుమతులు అందజేస్తున్న సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు.



ప్రణాళికా సంఘం సభ్యుడు శ్రీ తర్లోక్ సింగ్ మేడచల్ సమితిలోని మత్స్య పెంపకం క్షేత్రాన్ని ఏప్రిల్ 3 వ తేదీన సందర్శించినప్పటి చిత్రం.



సికిందరాబాదులో ఏప్రిల్ 5 వ తేదీన ఆంధ్ర సబ్ ఏరియాలో కమాండర్ బ్రిగేడియర్ డి. ఎమ్ సయీద్, 33 జె ఎమ్. ఓ./12 ఎస్. ఎస్. ఆర్. సి/ ఇ. సి ఆఫీసర్ల పేరేడులో వందన స్వీకారం చేస్తున్న దృశ్యం

# అడవి మల్లె

సీరియల్ :

## 2

"నాన్నా! నాన్నోయ్! చంద్రం రాసిన కథకు మొదటి బహుమతి వచ్చింది నాన్నా!" అంటూ దీపావళి సంచిక చేతిలో పట్టుకొని హేమామాలిని తండ్రి గదిలోకి దూసుకొచ్చింది. ప్రసాదరావు చదువుతున్న పుస్తకం మడిచి బల్లమీద పెట్టాడు. కళ్ళద్దాలు తీసి హేమవైపు చూశాడు. హేమ వదనంలో ఆనందపు అర్ణవం అలుముకుని ఉంది.

"ఏమిటమ్మా! చాలా హుషారుగా ఉన్నావు?" అన్నాడు ప్రసాదరావు ఆప్యాయంగా కూతురివైపు చూస్తూ.

"చంద్రానికి మొదటి బహుమతి వచ్చింది నాన్నా!" సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అవుతుంది హేమ.

"ఎందులో నమ్మా," ప్రసాదరావు చిరునవ్వుతో అడిగాడు.

బాలల కథల పోటికి చంద్రం కథ రాశాడు–నేనప్పుడే చెప్పాను మొదటి బహుమతి నీదేనని.

"పిచ్చి పిల్ల" అనుకున్నాడు తండ్రి మనస్సులోనే.

"పెద్దవాడైతే చంద్రం చాలా పెద్ద రచయిత అవుతాడుగదు నాన్నా"?

"అవునమ్మా! చంద్రం చాలా గొప్పవాడు అవుతాడు." అన్నాడు పక్కనే సోఫాలో కూర్చొని ఉన్న హేమ తలను నిమురుతూ.

"ఇప్పుడే వస్తా నాన్నా!" అంటూ హేమ బయటకు పరుగెత్తింది.

హేమ చంద్రానికి ఈ వార్త అందించటానికే పరిగెత్తిందని తెలుసుకున్న ప్రసాదరావు తనలో తనే నవ్వుకున్నాడు – అన్నీ సవ్యంగా జరిగితే, దైవం అనుకూలిస్తే– ఆ ఇద్దరూ ఒక ఇంటివాళ్ళయితే – ఇక తన కేకొరతా ఉండదు. కూతురు భవిష్యత్తుని గురించిన తీయని తలపుల్లో తేలిపోయాడు ప్రసాదరావు.

హేమ కృష్ణారావుఇంటికి వచ్చేప్పటికి హాల్లో ఉన్న రెండు పడకకుర్చీల్లో కాంతమ్మా కృష్ణారావు కూర్చొని చంద్రం చదువును గురించి తర్కించుకుంటున్నారు. భార్య పోరుతోపాటు కృష్ణారావులో తమ్ముణ్ణి చదివించాలనే పట్టుదల పెరిగింది. కాంతమ్మ కాపరానికి వచ్చిన ఇంత కాలానికి భర్తముందు మొదటిసారి ఓడిపోయింది. కోపంతో, రోషంతో ముఖం కందగడ్డలా అయింది.

"చంద్రం, చంద్రం" అంటూ పరుగెత్తుకుంటూ వచ్చిన హేమ హాల్లో కృష్ణారావునూ కాంతమ్మనూ చూసి చటుక్కున ఆగిపోయింది.

"రామ్మా రా! నాన్నగారేం చేస్తున్నారు?" కృష్ణారావు ఉత్సాహంగా అడిగాడు అప్పటికి భార్యతో పడుతున్న ఘర్షణ ఆగిపోయినందుకు సంతోషిస్తూ.

"ఇప్పుడే భోజనం చేసి ఏదో చదువుకుంటున్నారు. చంద్రం లేడాండి!" అన్నది. హేమ.

"ఉన్నాడమ్మా. చంద్రం!" అంటూ కేక వేశాడు కృష్ణారావు.

"చూశారా! పత్రికలో చంద్రం రాసిన కథ పడింది. మొదటి బహుమతి కూడా వచ్చింది." అంటూ హేమ తన చేతిలో పత్రికను కృష్ణారావుకు అందించింది. కృష్ణారావు చేతిలోకి తీసుకున్నాడో లేదో కాంతమ్మ వచ్చి లాక్కుంది. హేమ కాంతమ్మవైపు గర్వంగా చూసింది. ఈ దెబ్బతో కాంతమ్మ చంద్రాన్ని ఎలా చులకనగా చూడగలదో చూస్తాగా అనుకుంది.

"నిజంగా!" కృష్ణారావు ప్రశ్నించాడు. కంఠంలో ఆశ్చర్యం, ఆనందం మిళితమైనాయి. చంద్రం రజనిని ఎత్తుకొని వచ్చి అన్న దగ్గరగా నిలబడ్డాడు. హేమ వైపు చూసి చిరునవ్వుతోనే పలకరించాడు.

"చంద్రం! నీ కథకు మొదటి బహుమతి వచ్చిందట. హేమ ఎంత మంచి వార్త తెచ్చిందో చూడు. నిన్ను చూసుకొని నిజంగా గర్విస్తున్నాను చంద్రం. నీకు ఇష్టం వచ్చినంత కాలం చదువుకో. వెధవ వ్యాపారం... వెధవ లెక్కలు...నువ్వే రాయాలా ఏం? అవసరమైతే ఇంకో మేనేజర్ని పెడతాను." కృష్ణారావు సంతోషాన్ని వెలిబుచ్చాడు.

వాసిరెడ్డి సీతాదేవి

చంద్రం కోర్కెలకు రెక్కలు తొడిగినట్లయింది. ఆనందంతో తేలిపోతూ వంగి అన్నపాదాలకు నమస్కరించాడు. అలా వంగిన తమ్ముణ్ణి రెండుచేతుల్తో పైకి లేవనెత్తాడు. కృష్ణారావు కళ్ళలో నీరు తిరిగింది. అవి ఆనంద భాష్పాలో లేక ఇంతవరకు తమ్ముడి యెడల చూపిన నిరాదరణను తలుచుకొన్నందువల్ల వచ్చిన దుఃఖాశ్రువులో చెప్పటం కష్టమే.

ఆ దృశ్యాన్ని చూస్తూన్న హేమ ఆనందానికి అంతంలేదు.

కాంతమ్మకు వళ్ళు మండిపోయింది.



"ఓయబ్బో! ఇంకేమో అనుకున్నా! ముప్ఫై యాభయ్ రూపాయల బహుమతి కేనా అన్నదమ్ము లిద్దరూ అంత మురిసి పోతున్నారు.'' కాంతమ్మ మూతి తిప్పింది.

"ఎంత డబ్బు వచ్చిం దనేది కాదు, మొదటి బహుమతి రావటం గొప్ప. దాని ఖరీదును డబ్బుతో కట్టలేము" అన్నాడు కృష్ణారావు.

అప్పటికే కథ చదవటం మొదలు పెట్టిన కాంతమ్మ కృష్ణారావు మాట విని పించుకోలేదు. చంద్రం ఉత్సాహం నీళ్ళు కారిపోయింది. హేమ ముఖంలో నిరు త్సాహం కనిపిస్తోంది.

అందరూ మౌనంగా ఆలోచిస్తున్నారు. అంత ఉత్సాహం ఇంతలో చల్లబడటం చూసిన కృష్ణారావు మనస్సు చివుక్కుమంది.

"చంద్రం ఇవ్వాళ మనందరం కలిసి సినిమాకు వెళదాము. హేమా! మీ నాన్న గారిని కూడా రమ్మను." అన్నాడు కృష్ణారావు.

చంద్రం కళ్ళలో కాంతిరేఖలు కది లాయి. వదినవైపు చూశాడు. కృష్ణారావూ హేమాకూడా ఆమెవైపు చూశారు. కాంతమ్మ కథ చదువుతూంది. ఆమె కను బొమ్మలు ముడిపడ్డాయి. కోపం ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది.

"చూశారా! చూశారా! ఎంత పని చేశాడో మీ ముద్దుల తమ్ముడు." అంది కాంతమ్మ. ఆమెగొంతులో కోపం, దుఃఖం నేను ముందంటే నేను ముందని పోటీ పడుతున్న ట్లనిపించింది.

"ఏం చేశాడేమిటి!" విసుగ్గా అన్నాడు కృష్ణారావు. ఇలాటి సంతోష సమయంలో కూడా భార్య ధోరణికి అసహ్యించుకుంటూ.

"ఇంకా ఏం చెయ్యాలి! ఆ కథ నా మీదే రాశాడు." కాంతమ్మ గొంతు బొంగురు పోయింది.

చంద్రం ఉలిక్కిపడి వదినముఖంలోకి చూశాడు. హేమ ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేస్తూ చూసింది చంద్రం ముఖంలోకి. కృష్ణారావు పకపక నవ్వాడు.

"నా బతుకు చూస్తే మీ అందరికీ నవ్వుగా ఉంది. అంత తేలికయి పోయాను. కాంతమ్మ గొంతులో మాటలు ఉంగిడి చుట్టుకుపోయాయి.

"ఛ! ఏవిటి కాంతం! నీ ధోరణి నువ్వూ! ఇవ్వాళ మనందరం కలిసి చంద్రంతో సినిమాకు వెళ్ళాలి," అన్నాడు కృష్ణారావు: భార్యను బతిమాలుకుంటున్న ధోరణిలో.

"నా బతుక్కి ఆ సినిమా ఒక్కటే తక్కువ." చీత్కారం చేసింది కాంతమ్మ.

"ఇప్పుడు నీ బతుక్కి వచ్చిన లోపం ఏమిటో."

"ఇంకా ఏం కావాలి. నా బతుకు బజార్లోకి ఎక్కింది; నిండా పద్దెనుగేళ్ళు లేని రాలుగాయ నన్ను పత్రికల్లోకి ఎక్కించ టమూ, కట్టుకున్న మొగుడు అదిచూచి ఆనందించటం ఇంతకంటే ఇం కేంకావాలి?"

"చంద్రానికి నువ్వంటే ఎంతో గౌరవం. ప్రేమా...నువ్వే వాణ్ణి."

"అవును నేనే వాణ్ణి కాల్చుకు తింటు న్నాను. వాడు రాసిందికూడా అదే. వదినకు బదులు సవతితల్లి అని పెట్టాడు అంతే." కాంతమ్మ పమిటచెంగుతో కళ్ళు అద్దుకుంది.

చంద్రం తన భుజాలమీద నిద్రపోతున్న రజనితో లోపలకు వెళ్ళిపోయాడు. హేమ తలవంచుకొని చిన్నగా బయటకు వెళ్ళి పోయింది. ఇది చూసిన కృష్ణారావు గుండెల్లో కోపం సుళ్ళు తిరిగింది.

"ఛీ రాక్షసీ! పిల్లల్ని బాధపెట్టటానికి కూడా వెనకాడవు."

"అవును నేను రాక్షసినే. నీ తమ్ముడు కూడ అలాగే రాశాడు. నేను పిల్లల్ని కాల్చుకుతినే రాక్షసిని. నేను మనిషినిగాను" అంటూ శోకాలు మొదలుపెట్టింది కాంతమ్మ.

కృష్ణారావుకు ఏం చేయాలో తోచలేదు. కండువా తీసి భుజంమీద వేసుకొని మండే ఎండలో ఎటో నడిచిపోయాడు. కాంతమ్మ మీద కోపం వస్తే కృష్ణారావు చెయ్యగలిగిన పనల్లా ఇదొక్కటే; నాలుగయిదు గంటల పాటు ఆమె కళ్ళకు కనిపించకుండా ఎటో వెళ్ళిపోవటం.

ఛీ; తన బ్రతుకెందుకు! ఈనాడుకూడా తమ్ముణ్ణి సంతోషపెట్టలేకపోయాడు. పీద తనంవల్ల మానవుడు కుంగిపోతాడు. బాధ లకు గురి అవుతాడు. కాని పీదవాడుకూడా అనుకూలవతియైన భార్య ప్రేమలో క్షణ కాలంపాటు తన కష్టాలను మరిచి స్వర్గ విహారం చెయ్యగలడు. ఇంట్లో ఆడవాళ్ళు తెలివితక్కువగా, గయ్యాళిగా, మొండిగా ఉంటే ఎరేత ధనం ఉన్నా మానవుడు సుఖించ లేడు.

ఊరంతా కాలుకాలిన పిల్లిలా అశాంతిగా తిరిగి కృష్ణారావు రాత్రి పదిగంటలకు ఇంటికి చేరాడు. వస్తూనే చంద్రంగది వైపు నడిచాడు.

చంద్రం వళ్ళుమరిచి నిద్రపోతున్నాడు. చంద్రం పక్కనే నిద్రపోతున్న రజని బోసి నవ్వులు విరజిమ్ముతూంది రని చంద్రాన్ని ఒక్కనిముషం విడిచిఉండదు. "నువ్వైనా త్వరగా పెద్దదానివయి మీ అమ్మకు బుద్ధి చెప్పమ్మా" అనుకున్నాడు కృష్ణారావు.

బయటకు వస్తున్న కృష్ణారావు ఉలిక్కి పడి గడపలోనే ఆగిపోయాడు.

"కొట్టవద్దు! అన్నయ్యా నన్ను కొట్టకు.

నేను ఆ కథ వదినమీద రాయలేదు. రజని తోడు! అమ్మతోడు! నీమీద రాయలేదు వదినా." కలవరిస్తున్నాడు చంద్రం.

"నన్ను కొట్టకు అన్నయ్యా! నేను తప్పుచెయ్యలేదు. ఇక నేను అసలు ఎప్పుడూ కథలు రాయను."

కృష్ణారావులోని చైతన్యం జడత్వాన్ని పొందింది. రాయిలా బిగుసుకుపోయాడు.

ఎంతో సేపటికి కాని కృష్ణారావు తేరుకోలేదు. నిద్రపోతున్న తమ్ముడిమీదకు వంగి నొసటిని ముద్దుపెట్టుకున్నాడు. కృష్ణారావు రెండు కళ్ళనుంచి జారిన కన్నీరు చంద్రం ముఖాన్ని తడిపింది.

## 3

తెల్లవారితే పరీక్షా ఫలితాలు తెలుస్తాయి. ఆరాత్రి చంద్రానికి నిద్రపట్టలేదు. పక్కమీద ఇటూ అటూ పొర్లుతున్నాడు. నిద్ర పట్టందే! ఏమయినా కథ రాసుకుంటే! గబుక్కున లేచి కూర్చున్నాడు. కాగితాలూ కలం తీసుకున్నాడు. పరీక్ష ఏమవుతుందో! ఒకవేళ తను తప్పితే! లెక్కలు బాగా చెయ్యలేదు. ఎందువల్లనో ఎంత ప్రయత్నించినా తనకు లెక్కలు సరిగ్గారావు! పరీక్ష రాసి తప్పక పాసవుతాను అనుకున్నాడు. కాని రోజులు గడిచినకొద్దీ పరీక్ష పోతుందేమోననే భయం పెరగసాగింది. తీరా పరీక్షాఫలితాలు తెలిసే రోజు దగ్గరకువచ్చింది. తనకు పరీక్ష పాసవుతాననే నమ్మకం పూర్తిగా పోయింది.

చేతిలోని కాగితాలూ, కలం బల్లమీద పెట్టి పుస్తకాలబీరువా దగ్గరకు వెళ్ళాడు. డిటెక్టివ్ నవల అయితే బుర్రకు పూర్తిగా పని కల్పించ వచ్చునుకొని "పీపాలో శవం" బయటకు తీశాడు. ఊఁ, వాక్యం ముందుకు జరిగితేనా? అక్షరాలు అంకెల్లా కనిపిస్తున్నాయి. అందులో తన నంబరు కనిపించటం లేదు.

తన భవిష్యత్తంతా రేపు రాబోయే పరీక్షా ఫలితాల మీదనే ఆధారపడి ఉంది. వదినకు తను పైచదువు చదవటం ఇష్టంలేదా. ఒక రకంగా అన్నయ్యకుకూడా ఇష్టంలేదు. అన్నయ్యకు తనను ఇప్పటినుంచే వ్యాపారంలో పెట్టటం ఇష్టం. తను పరీక్ష తప్పితే అన్నయ్యదగ్గిర పైచదువుకు వెళతానని పట్టు పట్టలేడు. అన్నయ్య, వదినను కాదనలేడు. తను చదువుకు స్వస్తి చెప్పక తప్పదు.

అయితే ఇక తనకు చదువుకొనే అదృష్టమే ఉండదా? అమ్మా, నాన్నా ఉంటే తను ఒక్కసారి పరీక్ష తప్పినంతమాత్రాన చదువు మాన్పించి ఇంట్లో కూర్చోపెట్టేవారా? తల్లిదండ్రులకు దూరమై ఈనాడు బాధపడుతున్నాడు. చదువు సంధ్యలకు దూరమైతే తను జీవితమంతా బాధపడాల్సిందే.

చదువులేని తనతో హేమ ఇప్పటిలాగే స్నేహంగా ఉంటుందా? తనను ప్రసాదరావుగారూ, హేమా, ఎప్పటిలాగే గౌరవిస్తారా? హేమ రేపటినుంచీ కాలేజీకి వెళుతుంది. మరి తనో! అన్నయ్య పక్కన కూర్చొని లెక్కలురాయటం నేర్చుకుంటాడు. చంద్రానికి ఏడుపు పొర్లుకొస్తోంది.

లేదు! ఏది ఏమయినా తను తప్పక చదువుతాడు. ఇటు ప్రపంచం అటు అయినా తను హేమ దృష్టిలో చిన్న కావటాన్ని సహించలేడు. తను పరీక్ష తప్పినా సరే చదువుతాడు. తను ఎటూ 'గురుకుల్' వెళ్ళి చదవా లనుకుంటున్నాడు. ఆ చదువుకు ఈ పరీక్షతో నిమిత్తంలేదు.

'గురుకుల్' వెళ్ళి చదవాలని ఉన్నదని చెప్పినప్పుడు ప్రకాశం, హేమా కూడా పకపకా నవ్వారు. చిన్నప్పుడు రామమందిరంలో రాత్రి పురాణ కాలక్షేపం చాలా శ్రద్ధగా వినేవాడు. ఆశ్రమాల్లో ఋషుల దగ్గర శుశ్రూషచేసి విద్య నార్జించే బ్రహ్మచారుల కథలు తనకు ఎంతో ఆనందాన్ని కలిగించేవి. తనకు కూడా అలాటి జీవితం గడపా లనిపించేది. 'గురుకుల్' — వాతావరణం కూడా అలాగే ఉంటుందట. తనకు అందరిలా కాలేజీ డిగ్రీలమీద మోజు ఏనాడూలేదు.

సంస్కృత సాహిత్యాన్ని క్షుణ్ణంగా చదివి మన భారతీయ సంస్కృతిని ఆకళింపు చేసుకోవాలనేదే తన కోరిక. తను తప్పక వెళ్ళి తీరుతాడు. చదువుతాడు. తను గొప్పవాడు కావాలి. ముఖ్యంగా హేమ కోసం, హేమ సంతోషం కోసం తను గొప్పవాడు కావాలి.

తెలతెలవారుతూండగా చంద్రం ఆలోచనలనుంచి నిద్రాదేవి ఒడిలోకి జారిపోయాడు.

ముత్తైదువు నొసటి కుంకుమలా తూర్పు దిక్కున సూర్యబింబం ఎర్రగా మిలమిలలాడుతుంది. దూరంగా ఫ్యాక్టరీ కూత కూలీలను ఆహ్వానిస్తున్నది. కృష్ణారావు కాఫీ తాగి సిగరెట్టు వెలిగించాడు తాపీగా. ఇంతలో పేపరుకుర్రాడు పేపరు విసిరేసి వెళ్ళాడు.

"ఇవ్వాళ చంద్రం పరీక్షలు పడతాయటగా" అంది కాంతమ్మ పేపరు తిరుగేస్తున్న భర్త నుద్దేశించి.

కృష్ణారావుకు ఆ విషయం గుర్తులేదు. తమ్ముడు తప్పక పాసవుతాడని అతని విశ్వాసం.

అన్ని కథలు రాసి, అందరి మెప్పునూ, అభిమానాన్నీ చూరగొన్న చంద్రానికి ఈ పరీక్ష పాసుకావటం ఒక లెక్కా అనుకున్నాడు. నింపాదిగా, ఎలాటి

ఆదుర్దా లేకుండా పరీక్షఫలితాలు పడ్డ పేజీ తిప్పాడు.

చంద్రం నంబరు కనిపించలేదు. మళ్ళీ ఆదుర్దాగా పైనుంచి కిందకు వెతక సాగాడు. తమ్ముడు తప్పాడని నమ్మలేకుండా ఉన్నాడు కృష్ణారావు. ఫస్టుక్లాసులో హేమా మాలిని ఒక్కతే పాసయింది.

"ఏం! అంత సేపు చూస్తున్నారు? చంద్రం పాసయడా?" అన్నది కాంతమ్మ. 'నాకు ముందేతెలుసు ఆవాజమ్మ పాసు కాదని' అనే భావం స్ఫురిస్తుంది కాంతమ్మ స్వరంలో.

కృష్ణారావుకు ఆమె ముఖంలోకి చూసే ధైర్యంలేదు.

"చెప్పరేం?" రెట్టించింది కాంతమ్మ.

"పాసుకాలేదు." గొణిగాడు కృష్ణారావు.

"హేమ పాసయిందా?"

"ఆఁ ఫస్టుక్లాసు వచ్చింది." అంటూ లేచి కృష్ణారావు చంద్రం గదివైపుకు నడిచాడు. కాంతమ్మ వెనకే బయలు దేరింది

చంద్రం మంచి నిద్రలో ఉన్నాడు. విసురుగా గదిలో ప్రవేశించిన కృష్ణారావు నిద్రపోతున్న చంద్రాన్ని చూసి మంచం దగ్గిరే ఓ క్షణం నిల్చున్నాడు సాలోచనగా. చేతిలో ఉన్న పేపరు మంచం పక్కనే ఉన్న టేబుల్‌మీద పడేసి నీరసంగా బయటకు నడిచాడు కృష్ణారావు. పరీక్ష తప్పిన తమ్ముడి గదిలోకి కోపంగా ప్రవేశించిన కృష్ణారావుకు నిద్రపోతున్న చంద్రం ముఖం చూడగానే ఏదో అవ్యక్తమైన బాధ కలిగింది. ఆ బాధ జాలితో మిళితమైనది. చంద్రాన్ని నిద్రలో చూసినప్పుడల్లా కృష్ణారావుకు తల్లి దండ్రులు గుర్తొస్తారు. తల్లి దండ్రుల ఆదరణకు దూరమైన తమ్ముడి యడల కృష్ణారావు హృదయంలో జాలి కట్టలుతెంచుకుంటుంది ఇలాంటి సమయాల్లో.

"సిగ్గులేకపోతే సరి ముఖానికి! ఇంకా నిద్రపోతున్నాడు. ఆడపిల్ల ఫస్టున పాసయింది. ఇంట్లోవాళ్ళమీద కథలు రాయటం వచ్చినవాడికి పరీక్ష రాయటం రాదు కాబోలు—" కాంతమ్మగొంతు నిద్రపోతున్న చంద్రం చెవుల్లో గరగరలాడింది. ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. అప్పటికే కృష్ణారావు, కాంతమ్మా, బయటకు వెళ్ళిపోయారు.

చంద్రానికి వళ్ళంతా విరగ్గొట్టినట్టుంది. రాత్రంతా నిద్రలేదు. తెలతెలవారుతుండగానే నిద్రపట్టిందేమో మండిపోతున్నాయి చాలని నిద్రతో బరువుగా వాలిపోతూ కళ్ళు.

మండుతున్న కళ్ళను బరువుగా, బద్ధకంగా తెరిచాడు. ఎదురుగా టేబుల్‌మీద పత్రిక కనిపించింది. అంతా అర్థమయింది. అయినా ఏదో ఆశ, వణుకుతున్న చేతుల్లోకి పత్రిక అందుకున్నాడు.

అనుకున్నంతా అయింది. ఇప్పుడు తను అన్నకు ముహం ఎలా చూపించాలి!

"తగిన శాస్తి జరిగింది. తమ్ముడి తెలివి తేటలకు విరగపడ్డందుకు."

కాంతమ్మ అంటున్న మాటలు చంద్రం విన్నాడు. అన్నయ్య ఏమంటున్నాడో వినాలని ప్రయత్నించాడు. కాని అన్నగొంతు వినిపించలేదు. అన్నయ్య ఏమీ అనలేదు. బహుశా తనలాగే బాధపడుతూ ఉండి ఉంటాడు. అన్నయ్యకు తనంటే ఎంతో ప్రేమ. కాని తను ఆ ప్రేమను నిలుపుకోలేక పోయాడు. తను కవిత్వమనీ, కథలనీ, పెట్టుకోకుండా ఇంకొంచెం శ్రద్ధగా చదివి ఉంటే పరీక్ష తప్పక పాసయి ఉండేవాడు. చంద్రానికి తను ఏదో తప్పుచేసిన ట్లనిపించింది.

చంద్రం దొంగలా అన్నా వదినలను తప్పించుకొని బాత్‌రూమ్‌కు వెళ్ళి కాళ్ళూ తేటలా కడుక్కొని వచ్చి బట్టలు వేసు కొన్నాడు. కాఫీ తాగటానికి వంటింట్లోకి వెళ్ళటానికి ధైర్యంచాల్లేదు. చిన్నగా ఇంటి నుంచి బయటపడ్డాడు.

ప్రసాదరావుగారి ఇంటిముందుకు వచ్చిన చంద్రం ఏదో ఆలోచించి వెంటనే గిరుక్కున తిరిగి, గబగబా పక్కసందులోకి వెళ్ళిపోయాడు. పరీక్షతప్పిన తను ఏ మొహం పెట్టుకొని వెళ్ళతాడు హేమ ఎదుటకు. తను పాసయి ఉంటే తెల్లవారేప్పటికి హేమ పరుగెత్తుకొని వచ్చి ఉండేది. కాని తను పరీక్ష తప్పాడు. హేమగానీ, ప్రసాదరావు గారు కానీ రాలేదు. బహుశా వారి దృష్టిలో తను ఈరోజునుంచీ తెలివితక్కువవాడు కావచ్చును. ఛ! అలా ఎన్నటికీకాదు. కేవలం తను చిన్నబుచ్చుకొని ఉంటాడు. తను బాధ పడటం చూడలేకనే హేమ వచ్చి ఉండదు.

ఏది ఏమయినా హేమ ఫస్టున వచ్చినందుకు అభినందించటానికి తను వెళ్ళి ఉండాల్సింది. తనకు ఆ గడపలో కాలు పెట్టటానికి ఎందుకు మనస్కరించలేదు. ఎందువల్ల? తనలో ఏమూలనన్నా హేమ అంటే ఈర్ష్యవుందా? అలా ఎన్నటికీ కాదు. హేమకు తను పరీక్ష తప్పటంవల్ల బాధ కలుగుతుందని తనకు తెలుసు. అందువల్లనే ఆమె ముందుకు వెళ్ళటానికి మొహం చెల్లటంలేదు తనకు.

చంద్రం తిండీ, నీరూ లేకుండా అనాటు ఎక్కడెక్కడో తిరిగాడు పిచ్చివాడిలాగ. ఊరంతా తిరిగి తిరిగి పబ్లిక్‌పార్కు కెళ్ళి కూర్చున్నాడు.

మంచు కురుస్తుంది. చలికాలం కావటం వల్ల ఏడు గంటలకే పార్కులో జనం పల్చబడ్డారు. రెండుచేతులూ మోకవేసుకొని భుజాలు పట్టుకొని పార్కు బెంచీమీద ఒక మూల ముడుచుకుని కూర్చుని ఉన్నాడు

చంద్రం. ఇంటికి వెళ్ళాలంటే భయంగా ఉంది. అన్నయ్య ఏమంటాడో, వదిన ఏమంటుందో! వాళ్ళు అన్నా, అనకపోయినా తనకే వాళ్ళ ఎదట పడాలంటే సిగ్గుగా ఉంది.

"చంద్రంలా ఉన్నాడు చూడు నాన్నా" అంటూ హేమ చంద్రం కూర్చున్న బెంచీ దగ్గరకు వచ్చింది. చంద్రం ఉలిక్కిపడి హేమవైపు చూశాడు. హేమ వెనకనే ప్రసాదరావు చేతికర్రతో నిల్చొని ఉన్నారు. చంద్రం బెంచీ మీదనుంచి లేచి నిల్చున్నాడు. ఏం మాట్లాడాలో తోచలేదు.

హేమ వదనం చంద్రం ఊహించినట్లు వికసించిలేదు. వాడిపోయి ఉంది. చంద్రానికి ఆశ్చర్యం కలిగింది. హేమ చంద్రం పరీక్ష తప్పినందుకు బాధపడుతుంది. తను ఫస్టున పాసయిన సంతోషం ఏకోశానా కనిపించటం లేదు. అర్థం చేసుకొన్న చంద్రం తనుపట్టి అసమర్థుడు అనుకొని కుంగిపోయాడు. హేమ తనకంటే వయస్సులో, ఉదారతలో, ఎంతో పెద్దదయినట్లు కనిపించింది చంద్రానికి.

"క్షమించు హేమా! నిన్ను కంగ్రాచ్యులేట్ చెయ్యటానికి రాలేకపోయాను" అన్నాడు చంద్రం సిగ్గుపడుతూ.

"బలేవాడివే. నీ పరీక్షపోయి బాధపడుతున్న వాడివి నన్ను కంగ్రాచ్యులేట్ చెయ్యటానికి రావటం ఏమిటి? ఉదయం పేపరు చూడగానే నేనూ నాన్నగారూ రావాలనుకున్నాం. కాని నీవు ఎంత బాధపడుతూ ఉంటావో ఊహించిన నేను రాలేకపోయాను. నాన్నగారుకూడా రాత్రికి వెళదాం లేమ్మా అన్నారు."

"ఆఁ అవును! చంద్రం! పొద్దుటినుంచీ నువ్వు ఇంటికి రాలేదట? మీ అన్నయ్యకు ఒకటే గాబరా. ఫోనులమీద ఫోనులు చేశాడు. మీ వదినకూడా పాపిష్టిదాన్ని నేనే తిట్టి చంద్రాన్ని ఇంటినుంచి వెళ్ళగొట్టానని ఏడుస్తున్నదట. ఇంట్లో ఎవరూ అన్నాలు తిన్నట్టులేదు. పద ఇంటికి వెళదాం." అన్నాడు ప్రసాదరావు.

అందరూ నడుస్తున్నారు మౌనంగా. చంద్రం బుర్రలో ఆలోచనలు ముసురుకుంటున్నాయి. వదిన ఏడ్చిందా? వదినకు తనంటే నిజంగా ప్రేమ ఉన్నదన్నమాట.

ఆమెకు తన ప్రేమ పైకి ఎలా చూపించాలో తెలియదు. పైకి ఎంత కఠినంగా కనిపించినా ఒకోసారి అంతగా కరిగిపోతుంది.

ప్రసాదరావు చంద్రాన్ని బలవంతంచేసి ముందు తన ఇంటికి తీసుకెళ్ళారు. భోజనం చేసి ప్రసాదరావు చంద్రాన్ని వెంటబెట్టుకొని వచ్చేప్పటికి కృష్ణారావు వరండాలో ఆదుర్దాగా పచార్లు చేస్తున్నాడు.

తమ్ముడు ఏమాయాడో తెలియదు. తను ఇంతవరకూ వెదికాడు కాని ఎక్కడా కనిపించలేదు, ఏవేవో అపశ్రుతులతో హృదయం కంపించి పోతుంది. కాంతమ్మ కనిపిస్తేనే కళ్ళలో కారం చల్లినట్లుంది కృష్ణారావుకు. అల్లరి చేస్తున్న రజనికి రెండు తగలనిచ్చాడు. కాంతమ్మకూడా ఏదో అరిష్టాన్ని ఊహించుకొని భయంతో ఉక్కిన పేనులా, బిక్కముహంతో వంటింటి గడపలోనే కూర్చుండి పోయింది.

ప్రసాదరావుతో కలిసివస్తున్న చంద్రాన్ని చూడగానే కృష్ణారావుకు ప్రాణం లేచి వచ్చింది. తమను అంతగాబరా పెట్టినందుకు కోపంకూడా రాకపోలేదు. తమాయించుకున్నాడు.

"కృష్ణారావుగారూ! చంద్రం మా ఇంట్లో భోజనం చేశాడు. దిగాలుపడి పార్కులో కూర్చునుంటే చూసి ఇంటికి తీసుకెళ్ళి ధైర్యం చెప్పాను. అసలే కుంగిపోతున్నాడు; సున్నిత హృదయం, మరేమీ అనకండి." అన్నాడు ప్రసాదరావు కుర్చీలో కూర్చుంటూ.

"అసలు వాణ్ణి నేనే మయినా అంటేగదా మరేమయినా అనటానికి? ఏఁరా అలా వెళ్ళేవాడివి మాటమాత్రం చెప్పొద్దూ! ఉదయం నుంచీ మీ వదినా, నేనూ కూడా ఎంత బాధపడిపోతున్నామో ఊహించావా."

"వాడి దృష్టిలో మనం రాక్షసులం. మనం తనకోసం ఎందుకు బాధపడతాం?" అంటూ అందుకుంది కాంతమ్మ.

చంద్రం అపరాధిలా తలవంచుకొని నిలబడ్డాడు. కాంతమ్మ రజని ఏడుపువిని లోపలకు వెళ్ళిపోయింది. కృష్ణారావు ప్రసాదరావు కూర్చుని ఉన్న కుర్చీకి ఎదురుగా కూర్చున్నాడు. అదనుచూసుకొని చంద్రం చిన్నగా అక్కడనుంచి కదిలాడు.

"చంద్రం! ఇలా వచ్చి కూర్చో" అన్నాడు ప్రసాదరావు.

రెండు అడుగులు ముందుకువేసిన చంద్రం అలాగే నిలబడిపోయాడు.

"రా! కూర్చో" అన్నాడు కృష్ణారావు.

చంద్రం వెళ్ళి అన్నపక్కగా కూర్చున్నాడు.

"పరీక్ష పోయినందుకు చాలా బాధపడుతున్నాడు. ఇక చదువుమాని వ్యాపారంలో దిగమంటారని భయపడుతున్నాడు." అన్నాడు ప్రసాదరావు చల్లకువచ్చి ముంత దాచటమెందుకు అన్న ధోరణిలో.

"అవునండీ నేను అలాగే అనుకుంటున్నాను. పాసయితే చదివించాలనే అనుకున్నాను. మళ్ళీ ఈ స్కూలు ఫైనల్ ఇంకో సంవత్సరం చదవాలి. అయినా స్వంతవ్యాపారం ఉన్నవాళ్ళకు డిగ్రీ చదువు లెందుకు లెండి. ఉద్యోగం చెయ్యాల్సిన అవ

సరం చంద్రానికలేదు. నలుగురికి ఉద్యోగం యివ్వగల వ్యాపారం చేతులో ఉన్నవాళ్ళం ఇప్పటినుంచే వాణ్ణి వ్యాపారంలో పెడితే వాడికీ మంచిది, నాకూ కొంత చేతికిత్తోడుగా ఉంటాడు." అన్నాడు కృష్ణారావు సిగరెట్టు ముట్టించు కుంటూ.

"నేను ఇంకా చదువు కుంటాను." గొణుగుతూ లోపలికి వెళ్ళాడు చంద్రం.

అలా వెళుతున్న చంద్రం వైపు చూస్తూ సిగరెట్టుపొగ వదులుతున్నాడు కృష్ణారావు.

"చంద్రానికి గురుకుల్ వెళ్ళి చదవాలని ఉంది. భారతీయ సంస్కృతినీ, చరిత్రనూ క్షుణ్ణంగా అర్థంచేసుకోవాలనీ, అది ఇంగ్లీషు చదివి సాధించేది కాదనీ చంద్రం అభిప్రాయం. సంస్కృత సాహిత్యాన్ని క్షుణ్ణంగా చదవాలని ఉవ్విళ్ళూరుతున్నాడు. ఇంత చిన్నతనంలో అన్ని నిశితమైన అభిప్రాయాలున్న కుర్రాడి మేధస్సు ఎలాటిదో ఊహించుకోండి. అతను కల్పించుకున్న ఊహాసౌధాల్ని పడగొట్టకండి, పసి హృదయం గాయపరచకండి. గురుకుల్ కు పంపించండి. అక్కడ చాలా నియమాలను పాలించాలి. అవన్నీ నచ్చకపోతనే తిరిగి వచ్చేస్తాడు. మీరు మాత్రం పంపించకుండా ఉండి తరవాత పశ్చాత్తాపపడే పరిస్థితులు కల్పించకండి." అన్నాడు ప్రసాదరావు.

లోపల ఇష్టం లేకపోయినా చంద్రం సంతోషం కోసం ఒప్పుకున్నాడుకృష్ణారావు. పోనియ్ కొంతకాలం వదినగారి సాధింపులన్నా తగ్గుతాయి అవి మనస్సును సర్ది చెప్పుకున్నాడు. ఏడు సంవత్సరాలు తమ్ముణ్ణి వదిలి ఉండాలంటే తనకు కష్టంగానే ఉంది. కాని తనక్కూడా భార్యమధ్యా తమ్ముడిమధ్యా అడకత్తెరలో పోకలాంటి బ్రతుకు తప్పుతుంది. మళ్ళీ తిరిగివచ్చేప్పటికి చంద్రం ఇరవైరెండు ఏళ్ళవాడు అవుతాడు. పూర్ణవ్యక్తిత్వంతో వస్తాడు. తమ్ముణ్ణి పాతికేళ్ళ రూపాన్ని ఊహల్లోనే చిత్రించుకున్న కృష్ణారావు ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయాడు.

ఇంతలో కృష్ణారావు పొగాకు కంపెనీలో పనిచేసే నాగేంద్రం వచ్చి నిలబడ్డాడు.

ప్రసాదరావు "పొద్దుపోయింది. వస్తా" నంటూ తను వచ్చినపని సవ్యంగా జరిగినందుకు సంతోషంతో చేతికర్ర ఊపుకుంటూ వెళ్ళిపోయాడు.

"ఏం ! నాగేంద్రం ఇంత పొద్దుపోయి వచ్చావు ?" అడిగాడు కృష్ణారావు నాగేంద్రాన్ని.

"ఆపొగాకు అమ్మిన తాలూకూ వెయ్యి రూపాయలు ఇంతకు ముందే ఆ ఆసామి తెచ్చి ఇచ్చాడు. నా దగ్గిర ఆ పూరిగుడిసెలో దాచటానికి భయపడే ఇచ్చిపోదామని వచ్చాను బాబుగారూ.' అంటూ రొంటినుంచి రూపాయల కట్ట తీసి అందించాడు నాగేంద్రం కృష్ణారావుకు. కృష్ణారావు నోట్లు లెక్కపెట్టాడు. పది వందరూపాయల నోట్లు.

చంద్రం రజనిని భుజాలమీద కూర్చోపెట్టాకొని ఆడిస్తూ వరండాలోకి వచ్చాడు.

"బుల్లెమ్మగోరూ ! ఇంకా నిద్రపోలా." అంటూ నాగేంద్రం, చంద్రం దగ్గిరకెళ్ళి రజనిని అందుకోబోయాడు. గళ్ళలుంగీ ఎర్ర బనీనులోనుంచి నల్లగా బలిసిన శరీరం. నాగేంద్రం రూపం చూసి రజని రెండు చేతులతో బాబాయిమెడను చుట్టివేసి మొహం పక్కకు తిప్పుకుంది.

డబ్బు లెక్కపెట్టుకుని కృష్ణారావు తలెత్తి చంద్రంవైపు చూశాడు. అతని బుర్రలో ఓ ఆలోచన మెరిసింది. చంద్రాన్ని గురుకుల్ పంపించటానికి ఎటూ నిర్ణయించుకున్నాడు. ఈ వెయ్యి రూపాయలు భార్యకు తెలియకుండాఅట్టేపెట్టిగుప్‌చుప్‌గాచంద్రాన్ని రైలు ఎక్కించవచ్చును. తనకు ప్రత్యేక దాపరికంలేదు వచ్చింది వచ్చినట్లు కాంతమ్మ దాపరికంలోనే ఉంటుంది. బ్యాంకు లో డబ్బులెక్క వారాని కోసారి గుమాస్తా దగ్గిర ఆరా తీస్తుంది. చంద్రాన్ని చదువుకు పంపటానికి ప్రస్తుతం ఓ వెయ్యిరూపాయలన్నా కావాలి. ఆ వెయ్యిరూపాయలు బ్యాంకునుంచి తియ్యాలంటే భార్య ఓచిన్న గాలిదుమారం లేపుతుందని తనకు తెలుసు. అదొక్కటే ముఖ్యంగా చంద్రం చదువును గురించి తనభయం. ఇప్పుడు ఆ సమస్య కూడా భగవంతుని దయవల్ల దానంతట అదే తీరిపోయింది. తను పొగాకుఅమ్మింది ఆమెకు తెలియదు. అదృష్టవశాత్తు ఇప్పుడు నాగేంద్రం ఈ డబ్బు తెచ్చిఇవ్వటం కూడా ఆవిడ చూడలేదు. డ్రాయరు సొరుగులాగి డైరీతీసి అందులో పది పచ్చనోట్లు పెట్టి మళ్ళీ డైరీ సొరుగులోపెట్టి మూశాడు.

తీరువాతీసి పెట్టాలంటే అసలే కాంతమ్మ అనుమానం మనిషి. చిన్నగా రేపు దాచవచ్చు ననుకున్నాడు.

నాగేంద్రం కృష్ణారావు దగ్గిర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. చంద్రం మాత్రం కృష్ణారావు ఎదురుగా నిద్రపోతున్న రజనిని భుజంమీద పడుకోబెట్టుకొని అలాగే నిల్చున్నాడు. అతన్ని చూసి కృష్ణారావుకు తనను ఏదో అడగాలనే నిల్చున్నాడని అర్థం అయింది. తమ్ముడు ఏ విషయం తనను అడగటానికి నిల్చున్నాడూ కూడా అర్థం అయింది కృష్ణారావుకు. తన నిర్ణయాన్ని తమ్ముడికి వినిపించా లనుకున్నాడు. ఇంతలోనే లోపలకు వస్తున్న కాంతమ్మను చూసి ఆగిపోయాడు.

"ఏరా ఇంకా నిల్చొనే ఉన్నావు ? వెళ్ళి పడుకో. రజనిని ఇలా ఇవ్వు" అంటూ తమ్ముడి భుజంమీద నిద్రపోతున్న రజనిని అందుకొని తమ్ముడికి మాట్లాడ్డానికి అవ

కాశం ఇవ్వకుండా తనగదిలోకి గబగబా వెళ్ళి పోయాడు.

తనను చదివిస్తాడో లేదో తేల్చేసుకోవాలని ఎంతో ఆలోచించి దైవం కూడ దీసుకొని వచ్చిన చంద్రంకు అసలు విషయం మాట్లాట్టానికి అవకాశం కూడా చిక్కలేదు. రోషం, కోపం, పెనవేసుకొని వస్తున్నాయి. ఏమయినా సరే తను చదవాల్సిందే. అన్న డబ్బు ఇస్తే సరి. లేకపోతే ఆ ఇంట్లో ఒక్క క్షణం ఉండకూడ దనుకున్నాడు. ఏదో నిర్ణయానికి వచ్చిన చంద్రం పగలంతా ఎండలో తిండీ తిప్పలూ లేకుండా తిరిగాడేమో. పక్కమీద మేను వాలుస్తూనే గాఢనిద్రలో మునిగి పోయాడు.

## 4

గోడగడియారం ఎనిమిది కొట్టింది. తూర్పు దిక్కున బారెడు పొద్దుఎక్కింది. కృష్ణారావుకు ఇవ్వాళ ఫ్యాక్టరీకి వెళ్ళటం ఆలస్య మయింది.

హడావిడిగా భార్య ఇచ్చిన కాఫీతాగి హాల్లోకి వచ్చాడు. వెంటనే కృష్ణారావుకు రాత్రి తను డ్రాయరు సొరుగులో దాచిన డబ్బు విషయం జ్ఞాపకం వచ్చింది. కాంతమ్మ రజనికి వంటింట్లో పాలుపడుతుంది. ఆ డబ్బు భార్య చూడకుండా భద్రపరచటానికి ఇదే అదను అనుకున్నాడు.

డ్రాయరు తెరుస్తూనే కాగితా లన్నీ చిందర వందరగా కెలికి వుండటం గమనించాడు కృష్ణారావు. ఆశ్చర్యం వేసింది. గబగబా డైరీకోసం వెతికాడు. డైరీ చేతికి తగలగానే 'అమ్మయ్య' అనుకున్నాడు. తీరా తీసి తెరచి చూస్తే డబ్బులేదు. మరుక్షణంలోనే భార్యమీద కోపం వచ్చింది. ఇలాటి విషయాలు పసికట్టటంలో ఆమెకు ఆమేసాటి అనుకున్నాడు. ఏమయినా సరే తను చంద్రానికి ఆ డబ్బు ఇచ్చి రెండు రోజుల్లోనే గురుకుల్‌కు పంపించాలి.

"కాంతం...కాంతం" గావుకేకపెట్టాడు.

"ఆ వస్తున్నా! ఏమిటా కేకలు కొంప లంటుకుపోతున్నట్లు." చేతులు పవిటకు తుడుచుకుంటూ వచ్చింది కాంతమ్మ వంటింట్లోనుంచి.

"ఆ డబ్బు ఎందుకు తీశావు?"

"ఏ డబ్బు!" తెల్లమొహం వేసింది కాంతమ్మ.

అన్నీ వేషాలు. వళ్ళు మండిపోయింది కృష్ణారావుకు.

"ఇంకేం డబ్బు! ఆ వెయ్యిరూపాయలు" గర్జించాడు.

"వెయ్యి రూపాయాలా? ఎక్కడివి? ఎక్కడ పెట్టారు?"

"వేషాలు వెయ్యకు. ఇలాతే ఆ డబ్బు మర్యాదగా."

"మీ కేమయినా పిచ్చిగాని ఎత్తలేదు గదా? అసలు మీరు అంటున్నది నాకు అర్థం కావటంలేదు. ఈసారి కాంతమ్మ కూడా వాల్యూం పెంచింది.

"రాత్రి నాగేంద్రం వెయ్యి రూపాయలు తెచ్చి ఇచ్చాడు. అది ఇక్కడే ఈ డ్రాయరు సొరుగులోనే దాచాను. తెల్లవారేప్పటికి ఏ దొంగ వస్తాడు. నువ్వే తీశావు. గొడవ చెయ్యకుండా ఇవ్వు. ఆ డబ్బునాకు చాలా అవసరంగా కావాలి.

"వెయ్యి రూపాయలు పోయాయా? పైగా నన్ను దబాయిస్తున్నారు. దొంగతనం చెయ్యాల్సిన కర్మ నాకేంకాలింది. తీస్తే తీశానని చెబుతాను"

"అదే చెప్పమంటున్నాను."

"నేను తియ్యందే తీశానని ఎందుకు చెబుతాను. అందుకే ఇంటిదొంగను ఈశ్వరుడైనా పట్టలేడంటారు."

"అంటే?"

"అంటే ఏముంది. నేను తియ్యలేదు. ఇకపోతే ఈ ఇంట్లో ఉన్న మూడో మనిషి..."

"కాంతం..." అరిచాడు కృష్ణారావు.

"అవును, ఇంకెవరు నీ తమ్ముడే తీశాడు." అన్నది కాంతమ్మ గట్టిగా హెచ్చు స్థాయిలోనే.

"ఛీ! నోరుముయ్!" కాంతమ్మ చెంప చెళ్ళు మన్నది.

కాంతమ్మకు ప్రపంచమంతా తలకిందులైన ట్లనిపించింది. భర్తచేత తను దెబ్బ తిన్నది. పది సంవత్సరాలుగా తన మాటకు జవదాటని తనభర్త కృష్ణారావు మొదటి సారిగా తనమీద చెయ్యి చేసుకున్నాడు. దెబ్బవల్లకలిగిన బాధకంటే కాంతమ్మకు భర్తలో కలిగిన మార్పు ఎక్కువ బాధను కలిగించిది. వాకిట్లో కట్టిఉండే మూగ పశువు ఒకసారిగా మానవభాషలో యజమానిని తిట్టటం ప్రారంభిస్తే ఆ యజమాని పరిస్థితి ఎలా ఉంటుంది? సరిగ్గా అలాగే ఉంది కాంతమ్మ మానసిక పరిస్థితి, పైట కొంగుతో కన్నీరు తుడుచుకుంటూ కదిలి పోయింది కాంతమ్మ.

కాంతమ్మ చెంప చెళ్ళుమన్న మరు క్షణంలోనే కృష్ణారావు కోపమంతా నీళ్ళు కారిపోయింది. కాలుజారితే తీసుకోవచ్చు కాని నోరు జారితే తీసుకోలేమనే సామెత ఉంది. కాని చెయ్యి జారితేకూడా తీసుకోలేము. తను ఏనాడూ చెయ్యని పనిచేశాడు ఈనాడు. కాదు తన భార్యే తన చేత ఇంత పని చేయించింది. కాకపోతే చంద్రం, తన రక్తం పంచుకొని పుట్టిన తన సోదరుడు దొంగా? చంద్రంలాంటి బుద్ధిమంతులు ఎందరు ఉంటారు? వాడి మంచితనానికి తనూ, తనభార్యా ఇచ్చే ప్రతిఫలం చివరకు ఇదేనా? తన తల్లీ దండ్రీ బ్రతికి ఉంటే ఈనాడు తనభార్య చంద్రానికి దొంగతనాన్ని అంటగట్ట గలిగేదేనా? అసలు ఇలాటి పరిస్థితి వచ్చేదా!

అదరిపోతున్న కణతలు నొక్కుకుంటూ కుర్చీలో కూలబడ్డాడు కృష్ణారావు.

ఏమయినా తను కాంతాన్ని కొట్టటంలో చాలా తొందర పడ్డాడు. భార్యమీద చెయ్యి చేసుకొనే మగవాణ్ణి తను పశువుకంటే హీనంగా తలచేవాడు— ఈ రోజు తను ఆదేపని చేశాడు. నిజంగానే కాంతం తియ్యలేదేమో! డబ్బు విషయం అడగ్గానే తెల్ల మొహం వేసింది. అంతా వేషాలు అనుకు

న్నాడు తను వళ్ళుతెలియని ఆవేశంలో. ఒక వేళ తీసిఉంటే "తీశాను ఏం చేస్తావు?" అనే తత్వం ఆమెది. పైగా ఆవిడకు నాగేంద్రం తనకు డబ్బు ఇవ్వటంగానీ, దాన్ని తను దాచటంగానీ తెలియనే తెలియదు. అలాటప్పుడు తను ఆమెకు దొంగతనాన్ని అంటగట్టలా? తను చేసిందిమాత్రం ఏమిటి? తను తన భార్యను 'దొంగ' అంటే ఆమె తనతమ్ముడే దొంగ అంది. అంతే. అంత మాత్రానికే తను చెయ్యి చేసుకున్నాడు. చివరకు మొగవాడిగా ముఖ్యంగా మొగుడిగా తనలో తెలియకుండానే దాగిఉన్న అధికారం, అహంకారం, సమయం చూసుకొని బయటపడింది. కాంతమ్మను తలచుకొని జాలిపడ్డాడు కృష్ణారావు.

ఇంతకూ ఆడబ్బు ఏమయినట్లు? రాత్రికి రాత్రి ఏ బయటిదొంగవచ్చి ఉంటాడు? ఆడబ్బుసంగతి తనకూ నాగేంద్రానికి మాత్రమే తెలుసు. వెంటనే కృష్ణారావుకు రాత్రితనఎదట ఏదోచెప్పటానికినిల్చొనిఉన్న చంద్రం జ్ఞాపకంవచ్చాడు. ఎవరో వీపుమీద కొరడాతో కొట్టినట్లయింది కృష్ణారావుకు ఆ ఆలోచనరాగానే.

అయితే...ఇంకా అనుమానం ఎందుకు. ఇది వాడిపనే. తను చదివించడనే అనుమానంతోనే చంద్రం ఇంతపని చేశాడు. ఎంత అవమానం! ఎంత అప్రతిష్ఠ! తన వంశంలో ఎన్నడూ లేని పని జరిగింది. ఇక కాంతం ముందు తను తల ఎలా ఎత్తుకు తిరగ్గలడు?

కృష్ణారావు హృదయంలో కోపం సుళ్లు తిరగసాగింది. గబగబాలేచి చంద్రం గదిలోకి వెళ్ళాడు. ఖాళీమంచం బోసిగా కృష్ణారావు మోహంలోకి చూసింది. బాత్‌రూమ్ దగ్గరకు వెళ్ళాడు. చంద్రం అక్కడాలేడు. ఇంటిచుట్టూ, ఇల్లంతా పిచ్చివాడిలా చంద్రం కోసం తిరిగాడు. చంద్రం జాడలు ఎక్కడా లేవు.

కృష్ణారావు వరండాలో గేటు వైపు చూస్తూ నిల్చున్నాడు. ఆకాశం మేఘావృతంగా ఉంది. మధ్య మధ్య వాన జల్లులు పడుతున్నాయి, కృష్ణారావు బుర్రలోలేస్తున్న ఆలోచనలలాగ.

చంద్రం సాధారణంగా ఎనిమిది గంటలకు ముందు నిద్రలేవడు. ఈరోజు నిద్ర లేవటమే కాకుండా ఈ వర్షంలో ఎవరూ చూడకుండా బయటకు వెళ్ళిపోయాడు. ఇంకా అనుమానం దేనికి! ఇది వాడిపనే. ఎక్కడకు వెళ్ళాడో!

ఇంతపని చేసినవాడు మళ్ళీ తిరిగివస్తాడా? ఒకవేళ తిరిగి రాకపోతే! అంతకోపమూ నీళ్లు కారిపోయింది. ఏదో అజ్ఞాత భయంతో వణికిపోయాడు.

ఆ వెయ్యిరూపాయలు ఖర్చు పెట్టేస్తాడు. ఏ బొంబాయికో చేరి. ఆ తరవాత! ఏ రౌడీల చేతిలోనో... లేక బిచ్చమెత్తుకొనో... ముందుకు ఆలోచించలేక పోయాడు. అలా జరిగితే తన తల్లిదండ్రుల ఆత్మలు తనను శపిస్తాయి. నిజమే, తన తమ్ముడు ఇలా దిగజారిపోవటానికి కారణం ఎవరు? తనే! తనే భార్యభయంతో ఏనాడూ తమ్ముణ్ణి ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్న పాపాన పోలేదు. ఆప్యాయంగా మాట్లాడి ఎరుగడు. కనీసం తన ఆస్తిలో సమభాగస్తుడయిన చంద్రానికి చదువు చెప్పించటానికి తనకూ, తన భార్యకూ ఇష్టం లేకపోయింది. తన పాపానికి పరిష్కారం లేదు.

వెంటనే ఏదో గుర్తుకొచ్చి ఫోన్ దగ్గరకు వెళ్ళాడు.

"హల్లో! నేను కృష్ణారావును. అమ్మా హేమా! నాన్నగారు లేరా? ఆహా! ఏం లేదు. చంద్రం అక్కడకు వచ్చాడేమోనని."

"రాలేదా! పొద్దుటే ఎక్కడకో వెళ్ళాడు. అందుకే..." అంటూ ముందుకు మాట్లాడలేక కృష్ణారావు రిసీవర్ పెట్టేశాడు.

హృదయంలో బాధ, భయం, అవమానం, కోపం, ఒకదాన్ని ఒకటి పెనవేసుకుపోతున్నాయి. అరచేతితో నొసలుపట్టుకొని కూలబడ్డాడు పక్కనే ఉన్న సోఫాలో.

ఇల్లంతా తుఫాన్ రాబోయేముందు ఉండే ప్రశాంతత అలుముకుపోయింది.

ఏదో అలికిడి విని కృష్ణారావు తలెత్తి చూశాడు. చంద్రం పిల్లిలా తన గదిలోకి దూరటం కనిపించింది. చంద్రాన్ని చూడగానే కృష్ణారావులో అంతవరకూ ఉన్న పశ్చాత్తాపం, భయం స్థానాన్ని కోపం ఆక్రమించుకుంది.

"చంద్రం!" కృష్ణారావు కేకకు ఇల్లు ప్రతిధ్వనించింది. చంద్రం ఆ కేకకు అదిరిపడ్డాడు. అపరాధిలా అడుగులో అడుగు వేసుకుంటూవచ్చి అన్నముందు నిలబడ్డాడు.

"ఏరా గాడిదా! ఎక్కడికి వెళ్ళావు?"

చంద్రం భయంగా అన్న మోహంలోకి చూశాడు. జవాబివ్వలేదు.

"ఏరా! మాట్లాడవు? ఆ డబ్బు ఎక్కడ దాచావు?"

ఈసారి చంద్రం మొహంలో భయం స్థానాన్ని ఆశ్చర్యం ఆక్రమించుకున్నది. బిగుసుకొని కొయ్యలా నిలబడ్డాడు.

"అలాచూస్తావేం? ఆ డబ్బు ఎక్కడ దాచావు? చెప్పు"

మాట పూర్తి కాకుండానే చంద్రం చెంప చెళ్ళుమన్నది. చంద్రం కళ్ళకు ఏదో వెలుగు కనిపించి అంతలోనే చీకట్లు కమ్మాయి. చంద్రంలోని జడత్వం మళ్ళీ చైతన్యంగా మారి ప్రవహించ సాగింది.

"నాకు తెలియదు," అన్నాడు. అన్నగారు మళ్ళీ ఎత్తిన చేతికి భయంతో తన రెండుచేతులనూ అడ్డంపెడుతూ.

"దొంగ వెధవా! అబద్ధాలు కూడా?" కసికొద్దీ రెండు చేతులతో అందినచోటల్లా బాదటం మొదలుపెట్టాడు కృష్ణారావు. చంద్రం శరీరాన్ని అప్పగించి నిల్చున్నాడు.

కొట్టి కొట్టి చేతులు నొప్పి పుట్టాయి కృష్ణారావుకు.

"చెబుతావా చెప్పవా? రాత్రి ఈ డ్రాయరులో దాచిన డబ్బు ఎందుకు తీసావు?"

(సశేషం)

# మరిన్ని ముత్యాలు

"బ్రహ్మచర్యేణ తపసా రాజా రాష్ట్రం విరక్షతి.
ఆచార్యో బ్రహ్మచర్యేణ బ్రహ్మచారిణమిచ్ఛతే.
బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిం.
అనడ్వాన్ బ్రహ్మచర్యేణాశ్వో ఘాసం జిగీర్షతి.
బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుముపాఘ్నత.
ఇంద్రో హ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వరాడభూత్.

—అథర్వ వేదము.

"బ్రహ్మచర్యవ్రతమును తపస్సుగా నిష్ఠతో నడపగలిగిన రాజే రాష్ట్రమును బాగుగా రక్షింపగలడు. బ్రహ్మచర్యనిష్ఠ గల బ్రహ్మచారికే గురువు విద్యలను నేర్ప గోరును. బ్రహ్మచర్యవ్రతచర్యలో శ్రద్ధాళువుగా నున్నకన్యయే యువకుఁడైనమంచిపతిని పొందగలదు. బ్రహ్మచర్యము నాచరించుఎద్దు, అశ్వము మాత్రమే బాగుగా మేత మేయగలదు. దేవతలు బ్రహ్మచర్యవ్రతనిష్ఠచేతనే మృత్యువును చంపిరి; బ్రహ్మచర్యవ్రతనిష్ఠాగరిష్ఠుఁడగుటచేతనే ఇంద్రుడు దేవతలకు చక్రవర్తి యయ్యెను. కనుక బ్రహ్మచర్యమునకంటే మించినఉత్తమసాధనము లోకప్రవృత్తికి ఆధారముగా ఏదియు లేదని తాత్పర్యము."—

"సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః
అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః"

—వాల్మీకి

— ఓరాజా ఎల్లప్పటికిని ముఖప్రీతిగా మాట్లాడువారు లోకములో అంతటను దొరకుచుందురు. కాని, అప్రియము హితము నైనఉపదేశము చేయుహితులు దొరకరు. ఒకవేళలభించినను వారిమాటలను వినువారు దొరకనేదొరకరు."—

వే కు వ

మ॥ "విన నయ్యెం గృకవాకుకూజితము లుద్వేలంబుగా సూరసూ
తనవోద్యత్కరకుంచికావిఘటితధ్వాంతారరక్రియా
స్వనముల్, కైరవిణీప్రసూనపృథుకస్వాపక్రియాలోలికల్,
దినకృన్మార్గనివారణత్వరితమందేహోగ్రసింహధ్వనుల్"

—ముక్కుతిమ్మన.

స్వయంవరకన్య, దమయంతి.

సీ॥ "కర్పూరకస్తూరికాప్రవాహంబులు
ప్రవహింప లోచనప్రాంగణములఁ;
గించిద్దిగంతరీకృతరదద్యుతి పెంపు
పలుకుబోటికినైన భ్రాంతి గాఁగ;
భూషామణివ్యాజమున నంగకమ్ముల
జనులచూపులు వినిశ్చలత నిలువ;
మహనీయలావణ్యమధువు నెమ్మనముల
నాకంఠముగఁ గ్రోల నవనిభుజులు;

తే॥ గీ॥ నలుఁ బ్రసూనచాపంబున గెలువ లేని
యంగభవునకు శక్రబాణాసనంబు
బహువిభూషణరత్నశోభామిషమునఁ
దాను గల్పించుచంద మందంబు నొంద."

—శ్రీనాథుడు.

*ధర్మము*

కం॥ "ధర్మజ్ఞు లైనపురుషులు
ధర్మువునకు బాధ సేయుధర్మువు నైనన్
ధర్మముగా మదిఁ దలఁపరు
ధర్మువు సర్వంబునకు హితంబుగ వలయున్."

—నన్నయభట్టు.

*యక్షప్రశ్నము*

తే॥ గీ॥ ఏమికతమున భూదేవుఁ డెసఁగు దేవ
భావమున? నాతనికి సాధుభావ మెవ్వి
ధమున నగు? నసాధుత్వ మెద్దానఁ జెందు?
మానుషుం డగు తనాఁ డేదానఁ జెపుమ?

*ధర్మజుని ఉత్తరము*

చ॥ "అనవుడు ధర్మజుం డనియె నధ్యయనంబున దేవభావముం
గను నవనీసురుల్పుఁ; డధికవ్రతశీలత సాధుభావ మా
తనికి; విశిష్టవృత్తి దిగఁ ద్రావి యసాధు వనంగ నుండు; శౌ
చనియతి లేక మృత్యుభయసంగతి నాతఁడు మానుషుం డగున్."

—ఎఱ్ఱాప్రెగ్గడ.

*సుజన దుర్జనులు.*

కం॥ "ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబుఁ బొనరించును; స
జ్జను లైనవారి కడఁకువ
యును వినయము నివియె తెచ్చు నుర్వీనాథా!

కం॥ "కోపము నుబ్బును గర్వము
నాపోవక యునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము ననునివి
కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా!"

—తిక్కన.

మ॥ "కలలోనం దను ము న్నెఱుంగనిమహాకష్టాత్ముఁ డైనట్టిదు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁప న్నంతనె మెచ్చి యార్తిహరుఁ డై తన్నైన నిచ్చున్; సుని
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్ ?"

—పోతనామాత్యుడు.

# మృగతుని శిఖరారోహణ-తొలిమహిళాబృందం

కుమారి రాణీ భగవాన్ దాస్

ఇంతవరకూ ఏ భారతీయ స్త్రీకూడా అధిరోహించని హిమాలయాలలోని 22,490 అ. సమున్నతమైన మృగతుని శిఖరాన్ని కడచిన అక్టోబరు తొలిదినాల్లో స్త్రీల తొలి అధిరోహణ జట్టు విజయవంతంగా అధిరోహించిందన్న వార్తను పత్రికల్లో చదివి మీలో చాలామంది ఆశ్చర్యపడేవుంటారు. ఈ జట్టులో అందరూ స్త్రీలే. కుమారి కుర్షీద్ ఉబ్రీగర్ (25)—అధిరోహణ జట్టుకు కార్యదర్శి. కుమారి సుధా నెరూర్కర్ (31). సెంట్రల్ రైల్వేనుండి శ్రీమతి శారదా కేదార్ (32). బెంగుళూరు నుండి కుమారి ఉషా సర్పేష్కర్ (22). షిల్లాంగునుండి కుమారి దుర్గా గురుంగ్ (19). హైదరాబాదునుండి నేను—అంటే రాణీభగవాన్‌దాస్ (19) యీ బృందంలోని వాళ్ళం. మా బృంద నాయకురాలు శ్రీమతి జాయ్‌సీ దున్‌షియత్. ఈమె ఇంగ్లండులోని స్త్రీల గైడు కమీషనరు. ఈమె యింతకు పూర్వం అనేకసార్లు కొండల అధిరోహణలో పాల్గొంది. 1958 లో యీమె హిమాలయాల అధిరోహణకు తొలిసారిగా ఇంగ్లండు వనితల అధిరోహణ బృందానికి నాయకత్వం వహించింది. అప్పట్లో యీమె యీ 19,000 అ. ఎత్తువరకు వెళ్ళగలిగింది. అయితే మిగతా మా అందరికీ యిదొక కొత్త ప్రయత్నం. అందువల్ల మృగతుని శిఖరారోహణలో అనిర్వచనీయమైన ఉత్తేజకరమైన మా అనుభవాలను మీకు అందించే ప్రయత్నం చేస్తున్నాము.

కొండల్ని అధిరోహించే శిక్షణ తరగతులను ప్రారంభించడం. దీనిలోనికి తొలి దఫాగా ఎంపిక చేయబడిన బహుకొద్ది మందిలో మేము ఉండడం—యిదంతా మా అదృష్టం. మా తల్లిదండ్రుల అనుమతి (మారాం చెయ్యగా చెయ్యగా లభించింది లెండి!) తీసుకుని కొండలను అధిరోహించే శిక్షణ తరగతుల్లో మూడేళ్ళ కిందట చేరాను. తొలిరోజు కొండలెక్కి ఒళ్ళంతాహూనం అయినప్పటికీ, ఆ తొలి రోజునాటి ప్రతి క్షణాన్నీ మధురంగానే మననం చేసుకుంటాను నేను. ఆ జ్ఞాపకాలు ఎంత ఉత్తేజకరంగా వుంటాయంటే శారీరకమైన బాధలు ఆ క్షణంలో రెక్కలొచ్చినట్టు ఏ దూరతీరాల్లోకో ఎగిరిపోతుంటాయి. కొండ లెక్కడంలో శిక్షణ తరగతులు పంచమర్హిలోని భారత్ స్కౌట్స్. గైడ్స్ శిక్షణ శిబిరంలో కొనసాగాయి. మానవ పదఘట్టనల మంజులరవశే వినని అత్యున్నత గిరిశిఖరాలు ఆకలికళ్ళతో మానవులవైపు దృష్టిసారించి తమను అధిరోహించమని ఛాలెంజీ చేస్తున్నట్టు సగర్వంతో నిలిచివుంటే; వాటి పరిసరాల మనోహర సుందర దృశ్యాలు సౌందర్యోపాసకుడైన మనిషి కళ్ళదాహాన్ని సంతుష్టి పరచి, అతని అధిరోహణా దృష్టిని అత్యున్నత గిరిశిఖరములవైపు మళ్ళిస్తున్నాయి.

విస్తృతమైన అనుభవానికి కేవలం యిది—అంటే పంచవర్హిలో తొలిశిక్షణ—ప్రథమ సోపానంమాత్రమే. అయినా, ఆ కొద్దిపాటి అనుభవంకూడా ఒళ్ళు జలదరింపజేసేదే. ఆకాశానికీ, రాళ్ళకూ మధ్య వ్రేలాడేమనిషి మనసులో ఆలోచనల్ని మాటల్లో చెప్పడం సాధ్యమా. ఆకాశం విశాలంగా, నీలంగా ఆవర్తించి అక్కడక్కడ వేలాడుతూన్న మబ్బు తునకలతో తలమీదకు తొంగి చూస్తుంటుంది. రాళ్ళు పటిష్ఠంగా, భీకరంగా నిలిచివుంటాయి. మొట్టమొదట కొండలెక్కేవారు వుపయోగించే కష్టమైన ముడుల్ని వేయడం తెలుసుకోవాలి. క్లిష్టపరిస్థితిల్లో పడిపోకుండా బేలన్సు నిలపడానికి తెలివిగా త్రాళ్ళనుపయోగించడం, వాటిముడులు అందుకు అనువుగా వేయడం తెలుసుకోవాలి. ఎత్తులో కళ్ళుతిరిగే భయాన్ని పోగొట్టుకోవాలి. సరిగ్గా ముడివేడంవల్ల ఒకరి జీవితం రక్షింపబడుతుందనీ, సరైనముడి వేయనందువల్ల ఒకజీవితమే అంతమైపోతుందనీ త్వరలోనే మాకు అర్థమయ్యింది. కొండల మీద చలికిగడ్డ కట్టుకుపోతున్న మాచేతుల్తో

[కుమారి రాణీ భగవాన్‌దాస్, ఇరవైరెండు వేల నాలుగువందల తొంభై అడుగుల ఎత్తు గల మృగతుని హిమగిరి శిఖరాన్ని అధిరోహించిన తొలి మహిళా బృందంలో సభ్యురాలు. 1958 లో పురుషుల బృందం ఒకటి యీ శిఖరాన్ని అధిరోహించింది. రెండవసారి జరిగిన యీ శిఖరారోహణ గత ఏడాది అక్టోబరు తొలిరోజుల్లో జరిగింది. కుమారి రాణీ భగవాన్‌దాస్ ఆంధ్ర ప్రదేశ్ నుండి పాల్గొన్న ఏకైక మహిళ. ఈమె లలితకళల కళాశాలలో విద్యార్థిని, ప్రస్తుత విద్యాశాఖ కార్యదర్శి శ్రీ ఎన్. భగవాన్‌దాస్ కుమార్తె.]

ముడులు వేయడానికి ప్రయత్నించే వరకూ నిజానికి మేము సరైన ముడుల్ని శీఘ్రంగానూ, వక్రమంగాను వేయవలసిన అవసరాన్ని గుర్తించనేలేదు. మా శిక్షణలో మా అనుభవం ప్రతిదీ మాకు యీ సమున్నత శిఖరారోహణలో ఉపయోగంగా నిలిచింది. ముడులు సరిగావేస్తే, కష్టాల్ని చిరునవ్వుల్తో అధిగమించ గలిగితే; ఆకలి కడుపుతో, నొప్పిపెట్టే పాదాలతో, అరిగిపోయిన అరచేతులతో ముందుకు అధిరోహించగలిగితే, ప్రశ్నలు వేయక ఉత్తరువులను అణుకువతో ఆచరిస్తే, స్వప్రయోజనాన్ని మరిచి యితర సభ్యులను గురించి ఆలోచిస్తే – అప్పుడు విజయానికి రాచబాటే. ఈ గుణాలన్నీ మాలో గర్ల్‌గైడ్ శిక్షణద్వారా సంక్రమించాయి.

ప్రాథమిక శిక్షణ అనంతరం అడ్వాన్స్ కోర్సు శిక్షణ యిచ్చారు మాకు. గత ఎండల్లోనే మేము డార్జిలింగులోని కొండల అధిరోహణా సంస్థలో పట్టా పుచ్చుకోవడంతో హెచ్. ఎమ్. ఐ. బేడ్జీని, వెండి మంచుగొడ్డలిని తగిలించుకోవడానికి అర్హతను సంపాదించుకున్నాం. సంతృప్తికరంగా యీశిక్షణ పూర్తిచేసిన వారికి వెండి మంచుగొడ్డలిని, హెచ్. ఎమ్. ఐ. బేడ్జీని బహూకరిస్తారు.

ఈ సంస్థలో శిక్షణ పూర్తిచేసుకుని యిలా బయటికి వచ్చామోలేదో భారత స్కౌట్స్, గైడ్స్ ఒక అధిరోహణా బృందాన్ని హిమాలయాలకు పంపించా లనుకొంటున్నదన్న వార్త తెలిసింది. అంతకన్నా ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఆ బృందంలో మాపేర్లు వుండడం. ఆశల రెక్కలు తగిలించుకుని అందమైన భవిష్యత్ హిమగిరుల శిఖరాలపైకి ఎగిరిపొయ్యాము. గంగోత్రి మంచుగిరిపైకి వెళ్ళాలని మొదట్లో అనుకున్నారుగాని వాతావరణం బావుండక ఆఖరిక్షణాల్లో ఆ ప్రయత్నం విరమించుకోవడం జరిగింది. ఏమయినప్పటికీ అదృష్ట దేవత చల్లనిచూపు మాపై ప్రసరించిందనే చెప్పాలి. అన్ని పనులూ త్వరితగతిని జరిగిపోతున్నాయి.

హిమాలయ అధిరోహణ సంస్థ పరికరాల అధికారి శర్మ మమ్మల్ని మృగతుని శిఖరాధిరోహణకు పూనుకోమని సలహా యిచ్చారు. ఈ శిఖరం 22,390 అ. ఎత్తు వుంది. దీన్ని గాని మేము ఎక్కగలిగితే స్త్రీలు కొండలను అధిరోహించే ప్రయత్నంలో మేము ఘన విజయాన్ని సాధించగలిగినట్టేనని ఆయన భావన. ఈ మృగతుని శిఖరాన్ని యింతకు పూర్వం ఒకసారే అధిరోహించారు. అది ఆడవాళ్ళు కాదు మగవాళ్ళు. 1958 లో అధిరోహించారు. మృగతుని శిఖరారోహణపై అమీర్ అలీ వ్రాసిన వ్యాసాన్ని శ్రీ శర్మ మాకు అందజేశారు. ఆ వ్యాసం మాకెంతో ఉపకరించింది.

మేమే–మా బృందం సభ్యులే–మా శిఖరారోహణకు కావలసిన అన్నిటినీ– అంటే కావలసిన సామగ్రి, వెళ్ళవలసిన మార్గం మొదలయిన విషయాలన్నీ స్వయంగా ఏర్పాటు చేసుకున్నాం. శిఖరారోహణకు పదిహేనురోజులు ముందుగా మేమంతా ఢిల్లీలో కలుసుకుని, ఏవేవి అవసరమో అన్నీ ఒక పథకం తయారుచేసుకున్నాం. ఒకసారి ఒక విషయం ఒక కొలిక్కి వస్తే, కొత్త సమస్య ఒచ్చిపడ్డంతో పూర్తిగా అంతకు ముందు వేసుకున్న లెక్కలన్నీ తారుమారయి పోతుండేవి. ఉదాహరణకు ఎంతోసేపు గింజుకుని ఆలోచించి తలలు బద్దలు కొట్టుకుని చివరకు మాకు మా సామానును మొయ్యడానికి ఎంతమంది పోర్టర్లు అవసరమో లెక్క వేసుకున్నాం. ఈ లెక్క వెయ్యాలీ అంటే వాళ్ళకు యివ్వాల్సిన డబ్బుమాట అటుంచి వాళ్ళగురించిన ఆహార పదార్థాల్నికూడా ఈ లెక్కలో కలుపుకోవాలన్న మాట. ఈ విధంగా యీ లెక్క పాపంలా అలా అలా పెరిగిపోతూనే వుంది. నిజమైన సంఖ్యను వెయ్యడం అసలు సాధ్యం కాదేమోనన్నంత విసుగుకూడా అప్పుడప్పుడు మాకు కలిగేది కూడాను. ఎలాగయితేనేం కృషి, సహనమూ– యీ రెండూ ఆయుధాలుగా చేసుకుని, యీ విషయంలో యితరుల దగ్గరనుంచి వచ్చే సహాయాన్నంతాసమీకరించుకుని చిట్టచివరకు యీ సమస్య ఎంత క్లిష్టమైనప్పటికీ సాధించాం. ముఖ్యమైన ఒక సమస్య డబ్బు. చివరికి మేము 50 మంది పోర్టర్లయితే చాలు అనుకున్నాం. నిజానికి మా సైజు బృందానికి యింతకన్నా ఎక్కువమంది పోర్టర్లు అవసరమవుతారు. ప్రతి పోర్టరు 60 పౌన్ల బరువును మొయ్యాలి. అంటే మేముకూడా అదనంగా కనీసం 30పౌన్లన్నా మొయ్యాల్సి వుంటుంది.

సమస్య లన్నింటినీ ఒక్కొక్కటీ సుగమం చేసుకుని మాకు కావలసిన వస్తువుల లిస్టు తయారు చేసుకుని ఒకటికి పదిసార్లు ఆ లిస్టును పరిశీలించి మూటా ముల్లే కట్టుకోవడం ప్రారంభించాం. ఏ వస్తువునీ వదలగూడదని అతి శ్రద్ధ తీసుకున్నప్పటికీ యింకా ఏదో ముఖ్యమైనదాన్నే మర్చిపోయామనే ఆలోచనే మాకు; ఒకసారి మనం యీ మైదానాల్ని దాటి కొండలమీదకు చేరుకున్నామో, మర్చిపోయినదాన్ని సంపాదిద్దామంటే యిక లాభంలేదు–సరే, ఆ విషయాలన్నీ తర్వాత విందురుగాని లెండి.

కావలసిన వస్తువుల్లో చాలామట్టుకు ఉచితంగానే లభించాయి. ఉదారంగా మాకు యితోధికంగా సహాయం చేసిన వాళ్ళందరకూ కృతజ్ఞతలు తెలుపుకోవాలి. ఈ 'అల్పుల అసాధారణ ప్రయత్నం' వారికి బాగా నచ్చింది. అందుకే అలా యితోధిక సహాయాన్నిచ్చి ప్రోత్సహించారు. ఇక సామాను, మూటాముల్లే సర్దుకోవడం ప్రారంభించాం. సామాను సర్దడం అంటే మాటలా. ప్రతి వస్తువునీ బరువు తూచాలి. జాగ్రత్తగా 60 పౌనుల మేరకు వాటిని విడివిడిగా మూటల్లాగ కట్టలు కట్టుకోవాలి. ఎలాగయితే యింతపనీ చేసుకున్నాక చివరకు బయలుదేరడానికి సంసిద్ధులయ్యాం. అయితే డార్జిలింగుకు వెళ్ళి జాయల్ స్మారక నిధి నుండి పరికరాలను సేకరిం

చుకు రమ్మనమని పంపిన దుర్గ తిరిగొచ్చే వరకూ ఎదురుచూడాల్సి వచ్చింది. శర్మను, ఏడుగురు షెర్పాలను వెంటబెట్టుకుని ఆవిడ తిరిగి వచ్చింది. ఈ షెర్పాలు ఢిల్లీలో మాకు కాస్త ఆందోళన కలిగించారు. వాళ్లు వచ్చి, ఏమయిపోయారో మాయమయిపోయినట్టు కనిపించలేదు. వాళ్ళను ఎలాగో వెతికి పట్టుకుని హెడ్ క్వార్టర్సుకు తీసుకువచ్చాం. ఈ షెర్పాలలో తాషి అన్నవాడు 'షెర్పా సర్దారు.' వాళ్ళల్లో కాస్తబలిష్టుడూ, పొడగరీ అయిన షెర్పా చుంగి మాకు వంటమనిషి. మొట్టమొదట వాళ్ళని మాకు పరిచయం చేసినప్పుడు కొద్ది రోజుల్లో మేము ఆత్మీయులమూ, ఆప్తులమూ, ఆపదలో, ఆనందంలో ఒకరికొకరం మార్గదర్శులంగా, సహాయకారులంగా అవుతామని అనుకోనేలేదు. అపాయంలో మనుషులు ఆప్తులవుతారని చెప్పుకోగా వినేవాళ్ళం. ఆ సత్యం కొండ లెక్కడంలో మరీ వేగంగాను, ఎక్కువగానూ నిజమవుతుందని తెలుసుకున్నాం. మనుషులను అర్థం చేసుకోవడానికి మామూలుగా సంవత్సరాలు పడితే విజానికి వాళ్ళ మంచితనం వాళ్ళ హృదయం కొండలమీద కొన్ని గంటల్లో తేటతెల్లమయిపోతుంటాయి.

మాదగ్గరవున్న సామానంతటినీ ఎండబెట్టి, ఒకసారి పరిశీలించి ఆ తర్వాత వాటిని మళ్ళీ మూటలు కట్టుకోవాలి. అయితే అట్టే కష్టమైన పని అనిపించలేదు. షెర్పాలు సాయంచేశారు. శర్మ మాకు ఎంతగానో సహాయపడ్డారు. చాలాజాగ్రత్తగా ప్రతి వస్తువునూ పరిశీలించి, మళ్ళీ మళ్ళీ పరిశీలించాం. రక్షణ మంత్రిత్వ శాఖ వద్ద నుండి ఆ ప్రాంతం మ్యాప్‌ను సంపాదించి యిచ్చారు శర్మగారు. ఆ పటం మాకు శిఖరారోహణలో బాగా వుపయోగించింది కమాండర్ కొహిలీ ఆర్మీ స్టోర్సులో నుండి టిన్నుల్లో ఆహార పదార్థాలను అందజేసి సహాయపడ్డారు. మాకు అన్నివైపుల నుంచీ అపార కరుణావాహినులు మా దగ్గరకు ప్రవహిస్తూ వచ్చాయి. అవన్నీ యిక్కడ చెప్పి యీ పేజీలను పూరించడం నాకిష్టం లేదు. మాకు సహాయపడిన ప్రతి ఒక్కరికీ మా హృదయపూర్వక నమస్కారాలు.

సమస్యల్ని పూరించుకొస్తుంటే కుప్పతిప్పలుగా అంతకు రెట్టింపు సమస్యలు పుట్టుకొస్తుంటాయేటి. మావిషయంలోనూ అది నిజమయ్యింది. మేమంతా సిద్ధమై ప్రయాణానికి ఉద్యుక్తులమయ్యేసరికి మాసామానును మోసే తగినంతమంది షెర్పాలను వెతుక్కోవడం ఒక సమస్యఅయి కూర్చుంది. మేము తీసుకెళ్ళాలనుకున్న అతితక్కువ సంఖ్య పోర్టర్లుకూడా మాకు దొరకలేదు. చివరకి ఒకవిధంగా యీ సమస్యను సాధించాలనుకున్నాం. మా బృందాన్ని రెండుగా విడదీసి, ముందుగా కొంతమందిమి బయలుదేరాం. ముందు బయలుదేరిన యీ జట్టులో కుమారి కుర్షీద్ ఉమ్రీగర్, షెర్పాతాషి, నేను వున్నాం. మేం ముగ్గురమూ సెప్టెంబరు 18న ప్రాతఃకాలం తొలివెలుగులు ఆకసాన్నుంచి భూమ్మీదకు వేలాడుతున్న ప్రకృతి మంచుతెరలకు రంగులు అద్దుతుండగా మా మా ఆహారాన్ని పొట్లాలు కట్టుకుని బయలుదేరాం. లంఖణాల గుర్రంలాంటి ఓ పాత కాలపు బస్సులో ప్రయాణం చేసిచేసి అలసి సొలసి చివరకు ఋషీకేశం చేరుకున్నాం. అక్కడ విశ్రాంతికై కాలి కమ్లెవల్లి (యాత్రికుల విశ్రాంతి గృహం)లో మాకు విడిది యిచ్చారు. ఆరాత్రి హాయిగా, మత్తుగా నిద్రపోదామని నడుములు చేరేశాం. కాని నిద్రపోతేనా! మేముతెచ్చుకున్న సామాను పరచుకుని యిలా నడుములు వాల్చామోలేదో మాకాళ్ళూ, చేతులూ, మోకాళ్ళూ, భుజాలు —ఒకటేమిటి, అన్నిటిమీదకూ ఒక్కసారిగా నిర్దయగా దండయాత్ర ప్రారంభమయ్యింది. ఈ దండయాత్ర యేమిటా అని సందేహం. లేచి కూర్చున్నాను. నాతోపాటు కుర్షిద్ కూడా లేచి కూర్చుని ఒళ్ళంతా గోకుకుంటూ ఒకచేగోల. టార్చిలైట్లు వెలిగించాం. అక్కడ సంగ్రామ సంసిద్ధతలో మాకు కనిపించినవి ఏమనుకున్నారు? గోడలమీదనుంచి నేలమీదకు మామీదకు దండయాత్రలు చేస్తూ బారులుతీర్చిన నల్లులు! అసంఖ్యాకమైన ఆ సైనికుల్ని చూసి ఢీలా పడిపోలేదు మేము. మేమూ తిరగబడ్డాం. దండయాత్ర సాగించాం. చేతికందినవాటిని చిన్నాభిన్నం చేశాం. అలాయుద్ధం చేస్తూ యిక నిద్రపోవడం అసంభవం అనుకుని ఎప్పుడు తెల్లవారుతుందా అని తొలివెలుగు రేఖవైపు ఆశతో కళ్ళప్పగించి, మనసుల్లో దేవుడిని ప్రార్థిస్తూ కూర్చున్నాం. ఎట్టకేలకు బరువు కళ్ళతో మేము ఎదురుచూస్తున్న ప్రాతఃకాల అరుణారుణా కిరణాలు ఆకసంలో పరచుకున్నాయి. మా హృదయాల్లో ఆనందం అలుముకుంది.

పోర్టర్లను ఏర్పాటు చేసుకుందామని ప్రొద్దుటే లాటా అన్న గ్రామానికి బయలుదేరింది కుర్షీద్. ఈ మధ్యలోజిల్లా మేజిస్ట్రేటు దగ్గరనుంచి పర్మిట్లను సంపాదించడంలోనూ లాటాకు మమ్మల్ని తీసుకువెళ్ళే రవాణా ఏర్పాట్లను చేసుకోవడంలోనూ మునిగిపోయాను.

ఆ మర్నాటి మధ్యాహ్నం లాటాకు బయలుదేరాం. అదే మాకు మా మార్గంలో తగిలే ఆఖరిగ్రామం. అంతటితో మాకూ, మానవ నాగరికతకూ సంబంధాలు పటాపంచలై పోతాయి. అక్కడ మరొక సమస్య ఎదురయ్యింది మాకు. అంతకు ముందు మా అంచనా ప్రకారం మాకు 50 మంది పోర్టర్లు కావాలని. కాని మాకక్కడ 30 మందే దొరికారు. తగినంత మంది పోర్టర్లు దొరకలేదు గనక యిప్పట్లో మేము చేయాల్సిన పని జట్టు రెండుగా విడిపోవడం ఒక్కటే. ఎందుకంటే యిలా మీనమేషాలు లెక్కెట్టుకుంటూ కూర్చుంటే మా పరిమిత ఆహారం కాస్తా కిందనే ఆఖరై పోయి అసలుకు ఏమీ మిగలనే మిగలదు. అందువల్ల వాతావరణం బాగా వున్నప్పుడు ముందుకు వెళ్ళిపోవడమే

తక్షణ కర్తవ్యం అనిపించింది. సెప్టెంబరు 24 న ప్రభాతకాంతులు కొండల మీదకు ఎగురుతుండగా, శ్రీమతి దస్తీత్, ఉషా షెర్‌పేష్కర్, సుధ, శారద, నేనూ, మరో అయిదుగురు షెర్పాలతో లాలా కారక్‌కు బయలుదేరాం. ఖుర్షీద్, డాక్టరు, యిద్దరు షెర్పాలు ఉండిపోయారు. మేము బయలు దేరేముందు ఒక్కొక్క పోర్టరుకూ ఒక్కొక నంబరు క్రమాన్ని యిస్తూరావాలి గనుక, యీ పంపిణీవల్ల కాస్తా ఆలస్యం అయి, ఆలస్యంగా బయలుదేరాల్సి వచ్చింది.

అమిర్‌ఆలీ నివేదిక కష్టమైన మార్గాన్ని ఉద్దేశించివుంది. అయితే మేము నిటారుగా వున్న రాళ్ళనయినా ఎక్కడానికి సంసిద్ధమే గాని రాళ్ళు చెమ్మగా వుండడంవల్ల అది మరీ కష్టపడాల్సి వస్తుంది. అదేమిటోగాని మాతోపాటు వర్షంకూడా పోటీపడ్డట్టు కొండ లెక్కాలనుకున్నట్టుంది— నలభై నాలుగ్గంటల పాటు కుండపోతగా ఒకటేవర్షం! నిటారుగా నిలుచున్న రాళ్ళమీంచి మీదికి పోవలసి రావడం, చెమ్మచెమ్మగా వున్న నేల, పూర్తిగా తడిసిపోయిన బట్టలు—వీటితో ఆ ఆరుమైళ్ళ బాటా అనంతంగా అనిపించింది మాకు.

చలిగాలులు మా వూపిరితిత్తుల్లో పేరుకు పోయి గజగజలాడిం చేస్తున్నాయి. దానికి తోడు తడిసిపోయిన బట్టలొకటి. మొదటి నుంచీ వాతావరణమూ, కొండలూ కూడ బలుక్కుని మా ధైర్యాన్ని పరీక్షిస్తున్నాయా అన్నట్టుంది. బయలుదేరే ముందు జావకాస్తా తాగి బయలుదేరాం. ఇప్పుడెలాగ? ఈ చలిలో వెచ్చటి పానీయం ఏదీలేదే. ఒక వైపు కడుపులో ఎలకలు పరుగెత్తి అల్లరి చేస్తున్నాయి. మరోవైపు ముఖంమీద చలి సూదుల్లా గుచ్చుకుంటోంది. నిజంగా మా ధైర్యసాహసాలకు యిదొక పరీక్షలాగే అనిపించింది. సాయంకాలం మేము శిబిరాన్ని చేరుకునేసరికి నిజంగా ఏదో ఓ పెద్ద ఘన కార్యాన్ని సాధించినట్టే అనిపించిందిమాకు.

షెర్పాలు మాకన్నా ముందుగానే అక్కడికి చేరుకున్నారు. మేము వెళ్ళేసరికి గుడారాల్నివేసి మాకు స్వాగతం పలుకు తున్నట్టుగా ఎదురు చూస్తున్నారు వాళ్ళు. ఆకలిని మర్చిపోవడానికని వెళ్ళగానే మా తడిసిన బట్టల్ని విప్పేసి, గబగబా వెచ్చటి ఈకలకోట్లు తొడుక్కుని నిద్రసంచుల్లోకిదూరి నిద్రమత్తులోకి జారుకున్నాం. అలసటవల్ల పట్టిననిద్ర హాయిగా, కలలులేక మత్తుగా అనిపించింది. మా వంటవాడు మంగినిద్రలేసి పొగలుకక్కే టీకప్పులు మా ముందుంచాడు. కళ్ళు తెరిచి చూస్తే వంటగుడారంలోనే నిద్రపోయినట్టు అర్థమయింది! నేను లేవడంచూసి మిగతా పోర్టర్లుకూడా లేచి మంటవేసి చలి కాచుకుంటూ కూర్చున్నారు. కాని అవేం కర్రలో పచ్చిమొద్దులు. వాటిమీద ఎంత కిరసనాయిలు కుమ్మరించినా మంట రాజుకోనేలేదు. చలి కాచుకోవడం పోయి పొగపీల్చుకోవలసి వచ్చింది.

మర్నాడు ఉదయం కళ్ళు తెరిచేసరికి అంతాఏదోమత్తుగా, మసగ్గా. చీకటిగావుంది. రాత్రి కుండపోతగా కురిసిన వర్షం శాంతిం చిందికానీ, ఆ చిహ్నాలు మాత్రం యింకా మిగిలిపోయినట్టుగా చిరిగిపోయిన గుడారం లోంచి వర్షం నీరుకారుతోంది. ఇదికొండల్లో వికసించిన మా తొలిఉదయం! మేము కన్న కలలకి దీనికీ ఎంత తేడా!!

అంతా స్తంభించిపోయి దుఃఖంతో బావురు మనేటంత దుఃఖ పూరితమైంది నాస్థితి. మా వంటమనిషి మాకొరకు ఆమ్లేటు, పరోటాలు తయారు చేసేటప్పటికి దాదాపు పదకొండు గంటలు కావచ్చింది. అప్పటికి ఉషవచ్చి నన్ను కలుసుకుంది. ఉషగుడారం నా గుడారంకన్నా యెక్కువ తడిసిపోయి ఆరాత్రి అంతా జాగరణచేశారు. వారి స్లీపింగ్ బ్యాగులుకూడా పూర్తిగా తడిసి పోయాయి. చలితో వణికే ప్రతి సమయంలోను ఆరోజు రాత్రినిగూర్చి జ్ఞప్తికి తెచ్చుకునే వారము. వాతావరణాన్ని తెల్పే వార్తాప్రసారం మా నిరుత్సాహపు హృదయాలకు ఆహ్లాదాన్ని కలిగించలేక పోయింది. అంతేగాక ఉరు ములతో కూడినవర్షం రానున్నదని సూచించే వారి ప్రసారం మాగుండెలను యింకా దిగజారేట్టు చేసింది. అయితే రానున్న 24 గంటలలో వాతావరణం బాగుంటుందని తెల్పిన వాతావరణ ప్రసారంలోని చివరి వాక్యం ఆవరించే భయాందోళనామేఘాలలో ఆశాకిరణంగామెరిసింది. మాకుకలిగిన యీ సంతోషానికి కారణం వాతావరణ వార్తా ప్రసారమో లేక "కష్ట సమయాలప్పుడు గైడ్ చిరునవ్వుతో ఉంటాడు" అనే 8 వ గైడ్ నియమావళి జ్ఞాపకం ఉండడం వల్లనో యేమో నేను చెప్పలేను. మా శ్రమనంతా సామానులపెట్టెలో సర్ది మేము సంతోషంతో ఉత్సాహంతో గడిపాము.

ఖుర్షీదు బృందంవారు మాకన్నా ఎక్కు వగా బాధలకు గురిఅయ్యారు. ఆ కనుమ చాలా గట్టిగాఉంది చలి తీవ్రంగా ఉంది. మేము ఎదుర్కొన్న దానికన్నా భారీవర్షం వారు ఎదుర్కొన్నారు. దీనికితోడు వారికి బరువులు మోసే కూలీల బాధలుకూడా ఉన్నాయి. వారి బరువులు తీసుకెళ్ళేటందుకు మేకలనుసాధించడానికి ప్రయత్నించారు. కాని వర్షాల మూలంగా దారి చెడిపోయిందని యజమానులు రావడానికి నిరాకరించారు. వారు కుదుర్చుకున్న కొంతమంది కూలీలు కూడా వాటర్‌ప్రూఫ్‌లు యివ్వందే రామన్నారు. అయితే గైడు ఏదో విధంగా పని సాధిస్తాడు. తమ దగ్గర ఖాళీగా ఉన్న సామాను బ్యాగులను చింపి సమంచేసి కూలీ లకు యిచ్చి వారిని కొంత సంతుష్టిపర్చారు. ఈ విధంగా వారు మమ్మల చేరుకునే సరికి మాకన్నా ఎక్కువగా నిరుత్సాహపడ్డారు. అయితేనేమి వారి తడిసిన వస్త్రాలు విప్పి వేసి స్లీపింగ్‌బ్యాగులు ధరించడంలో మేము సహాయం చేశాము. వారి స్లీపింగ్ బ్యాగు లన్నీకూడా తడిసే ఉన్నాయి. అందువల్ల మా స్లీపింగ్ బ్యాగులలోనే చోటుయిచ్చాము. ఇది మరీ దుస్తరం! అయితే ఆ పర్వత కోనలలో ఉన్న దానితోనే సరిపెట్టుకోవాలి కదా. (సశేషం.)



# ఆంధ్రప్రదేశ్‌లో యాత్రా స్థలాలు

---- I ----

(ఫొటోలు : ప్రధాన సంపాదకులు)



ఆలంపురం మహబూబ్‌నగర్ జిల్లాలో ఒకతాలూకాకేంద్రం. అక్కడకు 6 మైళ్ళ దూరంలో ఆలంపురంరోడ్డు రైల్వేస్టేషన్ ఉన్నది. ఈ స్థలం తుంగభద్రా నదీతీరాన ఉన్నది. గ్రామానికీ తుంగభద్రా నదికీ మధ్యగా బ్రహ్మేశ్వర, పాపనాథ దేవాలయాలు వెలసిఉన్నాయి. ఈ దేవాలయాల శిఖరాలు శిల్పచెక్కడాలతో అలరారుతున్నాయి. పశ్చిమ భారతంలోని రాతితో మల్చిన దేవాలయాల అలంకరణ విధానాలతో యీ దేవాలయాలు పోలి ఉన్నాయి.





"వందన" ఆలంపురంలో ఉన్న ఆరు చిన్న గదులు గల విశ్రాంతి గృహం.

మహానందిలోని దేవాలయం దృశ్యం. కర్నూలు జిల్లాలోని నంద్యాల రైల్వేస్టేషన్‌కు దాదాపు 10 మైళ్ల దూరంలో శైవ భక్తుల ప్రఖ్యాత స్థలం మహానంది ఉన్నది. పర్వతపంక్తుల సుందర దృశ్యాలతో నంది ముఖంనుండి వెలువడే నీటిధారతో ఏర్పడ్డ ఒక పెద్ద సరస్సుతో యీ ప్రదేశం ఆహ్లాదకరంగా ఉంటుంది. అరటితోట, పాడిక్షేత్రం యిక్కడ ఉన్నాయి. ...





... ఈ సరస్సులోని నిర్మలమైననీటిగుండా అడుగుభాగంలోని రంగురంగుల చిన్న రాళ్లు స్పష్టంగానూ స్వచ్ఛంగానూ, కన్పించి వింతదృశ్యాలను స్ఫురింపచేస్తాయి.



మహానందిలో పవిత్రస్నానాలు.



మహానందిలోని 'శంభుప్రియ' విశ్రాంతి గృహం. ఇందులో రెండు చిన్న గదులు ఉన్నాయి.



అహోబిలంలోని 'లక్ష్మీనిలయం' విశ్రాంతి గృహం. ఇందులో 3 చిన్న గదులు ఉన్నాయి.



శ్రీశైలం దేవాలయంలోని నటరాజస్వామి విగ్రహం.

కళ్యాణ మంటపం (శ్రీశైలం)





శ్రీశైలంలోని 'శైలవిహారం' విశ్రాంతి గృహం.
ఇందులో 5 గదులు ఉన్నాయి.

# మిహిరకులుడు

సీరియల్ నవల :

(ఏడవ యధ్యాయము)

గాంధారరాజధాని యయిన పుష్కలావతీనగరం పురంధ్రి మిహిరకులుని రాకకు విగతకంచుకయై విముక్తనీవియై చకచ్చకితపయోధరయై సంధ్యాకాంతిరమణీయగవాక్షాభిరామపులకితాక్షియై స్వాగతి నెఱపెను. కాని యా పట్టణపురంధ్రి యెంత సంతోషించెనో యామె శరీరమైన దేశము తా నంత పులకరించినట్లు లేదు. భయకంపితవలె నంతర్నిహితసందేహభాజనవలె విగళితపాదాంభోరుహయై దేశము చలించిపోయినది. రా జల్లుని జూచి మిపుల స్వాగతి నెఱపెను. కాని రెండేండ్లు జాగుచేసినందుకు మనసులోఁ గొంత కష్టపడుచుండెను. అంతకంటెఁ గష్టమైన విషయ మేమనఁగా నతఁడు కల్యాణవతిని వదలిపెట్టి వచ్చెను. భర్త యేదైన దీర్ఘప్రయాణముమీఁదఁ బరదేశమునకుఁ బోవుచున్నప్పుడు భార్యను బుట్టినింట దింపుట న్యాయముగదా! రాజవంశములం దీ మర్యాద తక్కువ యైనను మగసంతానము లేని యత్తవారింట భార్యను దింపుట యుక్తమే యగును. పట్టమహిషి యైన కల్యాణవతీదేవి యున్నచోఁ గాశ్మీరరాజధానియం దుండవలయును. లేనిచో భర్తవెంట నుండవలయును. రాజప్రతినిధిగా రాజధానియందు రాణి యుండుట ప్రజలకు ధైర్యహేతువు. రాణియు, రాజును నిద్దఱు లేనిచోఁ బ్రజ లెవరిని జూచి భయపడవలయును. ఎవరియందు భక్తిని ప్రదర్శింపవలయును. ఇట్టి కుశలప్రశ్నలు, సమాధానములు నయిన తరువాత మరియాదలు నెఱపిన తరువాత సేనలు విడిసిన తరువాత స్నానపానము లయిన తరువాత రాజును మిహిరకులుఁడును దర్పమల్లుఁడును కూర్చుండి కడచిన రెండేండ్లలోపలి వ్యవహారము లన్నియుఁ బరస్పరము తెలియజేసికొనిరి. దర్పమల్లునియొద్ద రాజ్యద్రోహుల పేర్లుండెను. అవి కొన్ని వేలమీఁద నున్నవి. మిహిరకులుఁ డిట్లనెను. 'తమరి యనుమతి యైనచో వీరి నందఱను మా దేశమునకు బంధితులనుగాఁ దీసికొని పోయెదను. వీరిని శిక్షించి రాజద్రోహము మరల జరుగ

విశ్వనాథ సత్యనారాయణ

కుండఁ జేసెదను'. అనఁగా గాంధారరా జిట్లనెను. 'రాజసమర్థుఁడు; యువరాజు లేఁడు. తత్స్థానీయురా లైన రాచకూతురు పెండ్లి చేసికొని భర్తవెంటఁ బోయెను. రాజు తా నెవ్వనిని దత్తత చేసికొనలేదు. రాజవంశము భవిష్య త్తేమగునో తెలియదు. రాజాధికారులు కొంత స్వేచ్ఛ నవలంబించి రన్నచో నది సహజము. వా రందఱను శిక్షించినచో రాజు క్రూరుఁ డందురు. అందుచేత మొదట నొక విషయము పరిష్కారమైన తరువాత వారిని శిక్షింపవలసినచో శిక్షింపవచ్చును. దర్పమల్లుఁడు మీకు దగ్గరవాఁడు. అందుచేత నాకు దగ్గరివాఁడు. అతనినుండి మనము దాచవలసిన విషయము లెక్కువ లేవు. నా మొదటి యభిలాష యేమనఁగా నా యల్లుఁడు రాజ్యము నుస్వీకరింపవలయును. అతని ప్రతినిధి నిచ్చట నుంచవలయును. అతఁ డాఱునెలలు శ్రీనగరమునందు, నాఱునెలలు పుష్కలావతియందు నుండవలయును. రెండురాజ్యములను దివ్యచకోరముగా ననుభవింపవలయును'.

మి॥ కు: రాజా! ఈ రాజ్యము యొక్క పైపరామరిక నన్ను చూడుమన్నచోఁ జూతును. కాని యీ రాజ్యము నా కవసరములేదు. ఆనాఁడు నేను దండెత్తి వచ్చినప్పుడు మీ రాజకుమారి నన్ను ప్రేమించుటచేత నామెతండ్రి యంగీకరించుటచేత నిట్లు జరిగినది కాని మీ దేశాధిపతి నన్నెదిరించినచో నేమయ్యెడిది? ఆయన గెలిచినచో నేను చెప్పలేను. నేను గెలిచినచో వృద్ధుఁడైన యా రాజును తొలఁగించి మఱియింకొకని కీ రాజ్య మిచ్చియుందును. వాఁడు నా క్రిందివాఁ డగును. నా చెప్పుచేతలలోనివాఁ డగును. నాకుఁ గప్పము కట్టువాఁ డగును.

దర్పమల్లుఁడు: అట్లైవడో రాజు చేయఁబడినచో నందరును లొంగియుండెడివారు. ఇప్పు డింతమంది రాజకుమారులలో నొకనిని రాజును జేసినచోఁ దక్కినవారు మాత్సర్యగ్రస్తు లగుదురు. రాజ్యమునందు శాంతి యుండదు. సమానప్రతిపత్తి గల పదిమందిలో నొకనికిఁ బట్టాభిషేకము జరిగిచోఁ దక్కినవారు వినయ మవలంబింపరు. అవలంబింపరు సరిగదా నిచ్చలు వాని యధికారమును వమ్ముచేసెదరు. ప్రతివానికిని దనకు రావలసిన సొమ్ము వానికి వచ్చినట్లనిపించును. రాజ్య మంతయుఁ

సల్లోలిత సాగరము.
మిహిరకులుడు : సుమారు రెండేండ్లుగా నా

పదిమందియు, ఐదువర్గములను పాలించు
చున్నారుగదా. అట్లు పాలించుటలో నెవ

రధికమైనశక్తిని ప్రదర్శించిరి. రాజ్యా
నందుటకు యోగ్యు డెవడు ? ఎవరు



తిరిగినవారిని నిర్మూలింపఁదగిన సామర్థ్య మెవరి కున్నది. తనతో సమానులు పదిమంది తన్ను చుట్టుముట్టగా వారందఱిని నిర్జింపఁగల సామర్థ్య మెవఁడు ప్రదర్శించుచున్నాడు. ఇది దర్పమల్లునకుఁ దెలియవలయును.

దర్పమల్లుడు : 'గాంధారరాజునకు రెండు తరాల దూరముగా నున్న నీలాంకుఁ డన్న రాజపుత్త్రుఁడు కలఁడు. అతఁ డొక్కఁడే దూరపుబంధువు. తక్కినవా రందఱు వానికంటె దగ్గరివారు. నీలాంకుఁడు సమర్థుఁడు, యోగ్యుడు. దోషులను నిష్కారుణముగా శిక్షించును. గుణము గలచోట నౌదార్యము ప్రకటించను నిర్భయుఁడు. కాని రాజునకు దగ్గరిబంధు వయిన నీలాంబరుఁడు నీలాంకునివంటి శూరుఁడు. నీలాంకుఁడు రాజుగా నీలాంబరుడు మహాసేనాధిపతిగా నున్నచో రాజ్యము భద్రముగా నుండును. కాని పూర్వపు మహాసేనాధిపతి యున్నాడు. మ్లేచ్ఛులు దండెత్తివచ్చినపుడు తాను పుష్కలావతీనిమాత్రమే రక్షించెను గాని దేశమును రక్షించుటకుఁ బ్రయత్నింపలేదు. ఆయనయు సమర్థుఁడే గాని రాజుయొక్క పరోక్షమందు రాజ్యము తనదియన్న భావము పెంచికొనలేదు. తరువాత మహారాజు చిత్తము.

మఱియెవ్వరును మాటాడలేదు. మిహిరకులుఁడు తన సేనను దీసికొని పశ్చిమరాజ్యములయం దెట్లుచేసెనో గాంధారరాజ్యమునం దంతట నట్లు చేసెను. ప్రజలావటిల్లిపోయిరి. మ్లేచ్ఛుల సందఱను చుట్టుముట్టెను. వారి నేరియేరి చంపెను. చిత్రవిచిత్రములుగా హింసించెను. మిహిరకులునకుఁ దన్నెవరో హూణుఁ డన్నారని తెలిసెను. ఆ మ్లేచ్ఛులే యన్నారని వారిని వధింప నారంభించెను. వారిలో నాయకులైనవారిని బట్టుకొని వారిని నిరాయుధులను చేసి 'మేమిరా నేను హూణుఁడనా, సుక్షత్రియుడనా? నేను హూణుడనురా! నేను గోనందవంశపు రాజకుమారుఁడను. మా రాజవంశము భారతయుద్ధమునకుఁ బూర్వము పదితరాల నుండి వచ్చుచున్నవంశము' అనుటయు వారిని గత్తులతోఁ గ్రుమ్మటయుఁ జేసెను. సేనాపతులు నివ్వెరపోయి చూచుచుండిరి. ఎవఁడో యన్నదానికి మఱియొవనినో శిక్షించుట యేమి? ఆ మాటలను గల్పించినది నిజానికి భారతీయులే.

ఆపట్టున మిహిరకులుఁడు గాంధార రాజ్యమున నాల్గునెల లుండెను. రోజునకు వేయిమందిగా నతనిచేత సంహరింప బడిరి ఇది నీలాంకున కిష్టములేదు, నీలాంబరున కిష్టములేదు. వా రిద్దఱి కెట్లు తెలిసెనో, తమలో నొకఁడు రాజగునని తెలిసెను. తమలో నెవ్వఁడు రాజు కాఁడు, కాక పోయినను ప్రజ తనది యైనట్లు, తన ప్రజ సంహరింప బడుచున్నట్లు వాఁడువాఁడు భావించెను. నోరు మెదపినచోఁ దనకు రాజ్యముతోపాటు ప్రాణములు కూడఁ బోవును. కొంతనాలుకకు మందు వేయగా నున్ననాలుక యూడిపోయిన దన్నట్లు, మున్ను దర్పమల్లునిచేతఁ దొలగింపఁబడిన దుర్గాధ్యక్షులు, లంచగొండులైన రాజాధికారులు నిస్సహాయులై, నిస్త్రాణులై, నీరవులై యుండిరి. తొలినాఁడు కసవు మేసిన రాజాధికారులు నేడు రాజాన్న మారగించుచున్నారు. అది గుణ మగునో కాదో వారికిఁ దెలియదు. దానికి ఫలిత ముందునో యుండదో తెలియదు. మానవుఁ డైనతరువాత నెప్పుడో యొకప్పుడు దోషము చేయును తప్పు సరిదిద్దుకొనును. వీడు మంచిమార్గమున పడినాఁడు. వీనిని శిక్షింప నక్కఱలేదని రాజు గ్రహింపవలయును. తండ్రి యట్లూహించును రాజు తండ్రి వలెఁ బ్రవర్తింపవలయునుగదా! తమ రాజు తమకుఁ దండ్రి. మిహిరకులుఁడు తమకుఁ దండ్రి కాఁడు. తమకు రాజు కాఁడు. నీలాంక నీలాంబరులను గూర్చిన వదంతి ప్రబలెను. కొందఱు పోయి వారి మఱుగు జొత్తురు. తా దూరకంత లేదు, మెడ కొక డోలన్నట్లు వారిస్థితి యేమగునో వారికిఁ దెలియదు! అట్లు మొఱపెట్టికొనినవారితో నీలాంకుఁడు తాను నిస్సహాయుఁడనని చెప్పును. తనకు దిక్కు లేదనును. 'ఇది యేదో పట్టి ప్రథ. ఆ మిహిరకులుండు చండప్రచండుఁడు. అతఁడు రాజ్యమును బరిత్యజించునా? ఓయీ! బకాసురుఁడు ఏకచక్రపురవాసులతో నొకసమయము చేసికొనెను. లేదా ఏకచక్రపురవాసులే వాని నా సమయమునందు బిగించిరి. ఓయి బకా! నీవు మారిమసగినట్లు మమ్మందఱను జంపినచో నీకే నష్టము. సంవత్సరగ్రాసము నొక్కదినములోఁ దిందురా? పదియేండ్లగ్రాసము నాల్గు దినములలోఁ దిందురా? మేము నీకు దినమున కొకపుట్టెడన్నము, రెండుమన్నులు, నొక మనుష్యుని వంతున పంపుదుము నీవు వేయేండ్లు వర్ధిల్లుదువుగాక! అప్పుడు బకునకు గృహనీతి తెలిసెను. నిజమే! అన్నమంతయు ఒకసారిగాఁ దిన్నచో వానకాలమున నిబ్బంది యగును అని గ్రహించి యంగీకరించెను. ఆ యంగీకరించుటలో రెండు లక్షణము లున్నవి. ఒకటి, దైనందిన జీవితము సురక్షితముగా నుండుట. రెండు, తన కున్న క్రూరత్వమన్న గుణము దిన దినము చక్కగా, పోషింపఁబడుట మిహిరకులుఁ డిట్టివాఁడు. అతఁడు ప్రతిదిన మెవ్వరినో చంపుచునేయుండవలయును. దానితోఁ

బాటు బకునకు భోజనతృప్తి జరుగుచున్నట్టుగా మిహిరకులునకు దోషులను వధించుచున్నట్టు నొకతృప్తి కలుగవలయును. మిహిరకులునియందీ రెండు లక్షణములున్నవి. మీదాఁక నెందులకు? నా స్థితి యేమి. నన్నో, నీలాంబరునో రాజునుగాఁ జేసినచోఁ జేయవచ్చునన్నది యేమహారాజరహస్యమో చిత్రముగా వెలికుబికినది. అట్లే నే నిప్పుడు మీతో నన్నమాటలు వెలికుబుకవచ్చును. అపుడు మిహిరకులుఁడు నాయం దెట్లుండునో చూడవలయును'. తన్నాశ్రయించినవారితో నీలాంబరుఁ డిట్లనును. 'రాజజామాతతోఁ జెప్పెదను. ఆయన నామాట కాదనఁ డనుకొందును ఈ రాజ్యము తనది కాదుకదా! ఇది మామగారి రాజ్యము. తాను దీని నాక్రమించికొన్నచో లోకాపవాదము నందును. రాజుకూడ నెవనినో కుమారుఁడుగా స్వీకరించునని వినికిడి. మేమందరము దగ్గఱిబంధువులము. రాజు మామాట కాదనలేడు. ఆయననుబట్టి మిహిరకులుఁడును గాదనలేఁడు. మీ కెందుకు మీ వ్యవహారము నేను చూతు.' నని వారిని బంపించును.

ఇట్లుండగా మిహిరకులునకు మామగారికిఁ దన కూతును జూడవలయునని మిక్కిలి కోరికగా నున్నట్లు తెలిసెను. ఇప్పటికిని పూర్తిగా నయిపోయినట్లే. మ్లేచ్ఛులు లక్ష మంది వధింపఁబడిరి. వారి శవదుర్గంధముచేతఁ దత్తద్దేశములయందలి వాయువులు దుష్టములై యారోగ్యహేతువులు గాకపోయెను. ఏవో యేవో వ్యాధులు జనులకు వచ్చుచుండెను వానివలన జనులు మరణించుచుండిరి ఒకదుష్టకార్యము క్రియావేళయందే కాక తదనంతరమునగూడ దాని దౌష్ట్యమును ప్రసరింపించుచునేయుండును. ఎట్లు గాలి దుర్గంధపూరితమై భవిష్యత్తునగూడ వ్యాధిహేతు వగునో యట్లే యొకానొక దుష్కార్యము భవిష్యత్కాలమునగూడ ప్రాణుల సుఖమునకు శ్రవణమాత్రమున విరోధియగును. అట్టిదే! ఏల యనఁగా మంచివార్త విన్నప్పుడు హృదయము వికసించును; మనస్సు సంతోషించును. దుర్వార్త విన్నప్పుడు హృదయము ముకుళితమగును; మనస్సు దుఃఖించును. ఆతృప్తియు నీ దుఃఖమును మానవునకు వైయక్తికముగాఁ బ్రత్యక్షములైన యనుభూతులు కల్గించునవియైనచో గాఢముగా నుండును. దూరవిషయములైనచో నాతృప్తి దుఃఖములయందు గాఢత్వ ముండదు, కాని యవి యుండును. హృదయములయొక్క వికసనముకుళనములు తనకు వ్యక్తిగతముగా నైన సుఖదుఃఖవార్తాశ్రవణమువలన జరిగెడి వికసనముకుళనము లుండవుగాని సామాన్యములైనవి యుండును. ఆ దుర్గంధము నూత్న నూత్న దివ్యగుణసంభృతవాయుతరంగములచేత నిష్కలుషమై కొన్నాళ్ళకుఁగాని బాగుపడదు ఇంతకును దుర్గంధవాయుజనితవ్యాధిదూషితులై మృతులైన వారును వారి బంధువులను మిహిరకులుని దేశమం దంతట నిందించుచునేవచ్చిరి. మిహిరకులుని ప్రశంసించెడివారి సంఖ్య మిక్కిలి తక్కువయ్యెను. భారతీయధర్మము మ్లేచ్ఛదూషిత మగుచున్నది. మ్లేచ్ఛగ్రస్త మగుచున్నది. ఇది కలికాలము. దీనిని రక్షించువాఁ డెవ్వఁ డను నాందోళన మెవ్వనికిఁ గలదో వానికే మిహిరకులుడు ప్రశంసనీయుఁ డగుచున్నాఁడు. మిహిరకులుని భయము లేనివారును కొలఁదిమందియే. వారిట్లనుకొందురు. 'ఈ కాల మనంతమైనది. ఏదేశమున నేసమయమున నేమి జరుగునో యెవ్వరికిఁ దెలియును. కొందరికి సంఘ మరణములు వ్రాసియుండును. వ్యక్తుల కర్మలు వారివారివి ప్రత్యేక ప్రత్యేకముగ నున్నను సమాహార భూతమైన కర్మ యొకటి యుండును. ఒక కొండ కొమ్ము విరిగిపడి వేయిమంది చత్తురు. సముద్రము పొంగి యొకచోటఁ బదివేలమంది చత్తురు. ఒక క్రూరుఁడైన రాజుచేత లక్ష మంది వధింపబడుదురు. ఆ దేశమున కేదో దుర్భిక్ష పట్టును. అపటి జనులంద ఱొక్క కాలమున నశింతురు. మఱియు మిహిరకులుఁడు విచిత్రమైన ధూమకేతువు. అతని వధలలో ధర్మ మున్నది. యధర్మ మున్నది. ధర్మము తక్కువయు, నధర్మ మెక్కువయు నందమా? ధర్మాచరణమునందు గ్రౌర్యముఁ జొప్పించినచో నది యధర్మ మిశ్రితముగాఁ గనిపించును' ఇట్లు కొందఱు చెప్పికొనుచుండిరి.

ఏది యెవ్వరు చెప్పినను మహాసృష్టిలో, రాజ్యములలో దేశములలోఁ దత్కాలమునఁ గత్తి గలవాఁడు బలవంతుఁడు. వాని చేతిలోని కత్తి యూడిపోవువఱకు వాఁ డప్రతాప్యుఁడు. సృష్టిలో నున్న మఱియొక లక్షణ మేమనగా నట్టివాఁడు దీర్ఘాయుష్కుడు. సృష్టి విలక్షణమైనది. మంచియు, చెడ్డయు మనుజులయందు మాత్రమే కాదు ప్రకృతిలోఁగూడ మిశ్రితములై యుండును. ఉన్నట్లుండి బ్రహ్మాండమైన ఝంఝ వీచును. మహావృక్షములను వేళ్ళతోఁ బెల్లగించును. మహాసౌధములను గూలద్రోయును. కాంతారమునందగ్నిదరికొనును. నదులుపొంగును. గ్రామములను సస్యములను నాశనము చేయును. సముద్రము పొంగి యొక తీరదేశము సర్వమును జలమయము చేయును. కంపములు వచ్చును. కొన్ని వేసంగుభూలలో నిప్పులు కురియును. కొన్ని వర్షాకాలములయందు జగత్తున నెండువస్తువన్నది లేకుండఁ జేయును. ఇది ప్రకృతియొక్క లక్షణము. కిరాతకులైన రాజులు దండయాత్రలు చేసి దేశ ప్రజలను క్షోభింపఁ

చేయుదురు. వారుకూడఁ బ్రకృతిలో నొక భాగమని చెప్పవలయును. మనుజులకు బుద్ధి లేదు. అట్టి రాక్షసులను మహావీరుఁ డని, విజయి యని, వానిముం దేరాజును నిలువలేఁ డని మొదలైన బుద్ధిలేని పొగడ్తలు పొగడుదురు. ఈ ప్రకృతి చేసెడి యల్లరులు ప్రజల కిష్టముగా నున్నట్లు కనిపించును. ఒక మహాగ్ని చెలరేగి పట్టణమును దహించును. తరువాతఁ బ్రజలు. అనఁగా నా యగ్ని ననుభవింపని వారలు తన్మహాగ్నిని వర్ణించి చెప్పికొందురు. ఇది యాశ్చర్యము. తనకుఁ దగులనంతవరకు మానవునకు సర్వము వార్తయే. వార్తయందు మానవుఁడు రమించును. ఆ వార్త తనయందు నిజమైనచో నేడ్చును.

మిహిరకులుఁడు నాల్గు నెల లైన తరువాత మ్లేచ్ఛ సంహార మైన తరువాత గాంధార రాజ్యములో మిక్కిలి దుష్టు లని తనకు నిరూపింపఁబడిన దుర్గాధ్యక్షులను రాజాధికారులను బంధిచేయించెను. మామగారి యనుజ్ఞ తీసికొనలేదు. మున్ను చెప్పెను గదా! అదియే యనుజ్ఞ. వీ రందఱిని తన దేశమునకుఁ దరలించికొని పోయెను. అందులో స్త్రీలున్నారు, పురుషు లున్నారు. కాదనుట కెవ్వఁడును లేఁడు. దుర్గముల యందలి సైన్యము దుర్గములందే యున్నది. రాజధాని యందలి సైన్యము రాజధాని యందే యున్నది. మిహిరకులుని వెంట నరువదివేల సైన్య మున్నది. వలదని యతనిని ప్రతిఘటించుట సాధ్యము కాదు. గాంధారమునందలి సైన్యము నంతను సమీకరించువాఁ డెవఁడు? మిహిరకులు నడ్డగించెడువాఁ డెవఁడు? నీలాంశుఁడు గాని నీలాంబరుఁడు గాని రాజైనచో వాఁడు తన దత్తతతండ్రి యైన మహారాజుతోఁ జెప్పినాడనుటకు వీలుండెడిదేమో! మిహిరకులుఁడు వెళ్ళిన తరువాత రాజ్య మేమి కావలయును. వృద్ధరాజే రాజ్యము పాలింపవలయునా? ఈ రాజకుమారులే దుర్గాధ్యక్షులుగా నుండవలయునా? ఎవ్వరికిని దెలియలేదు. మిహిరకులుఁడు కాశ్మీరముఁ జేరెను. ఏఁబది వేలమంది బంధితులను జెఱసాలలో నుంచెను. వారికొఱకు వేఱు చెఱసాలలు నిర్మింపవలసివచ్చెను. వారి దోషములను నిరూపించుటకుఁ బదిమందితోడి యొక సభ నేర్పఱచెను. దానికి నిష్కరుణుఁ డధ్యక్షుఁడు. ఇది యిట్లుండగా మిహిరకులుఁడు వచ్చినతరువాత గాంధారములో నిపుడు తక్కువయైన ప్రజాసంఖ్య యేఁబదివేలుమాత్రమే యయినను దేశమంతయు నిర్జన మైనట్లు ప్రజలు తల్లడిల్లఁజొచ్చిరి.

పూర్వము దోషులైన రాజాధికారులు నీలాంబరునితోఁ జెప్పికొన్నప్పుడు నీలాంబరుఁ డేదో తమ కుపకారము చేయునని వారు భావించిరి. నీలాంబరుఁ డేమియుఁ జేయక పోవుటచేత బంధితులయినవా రందఱు కోపము మిహిరకులుని మీఁదఁ గాక నీలాంబరుని మీఁద వహించిరి. దుర్గాధ్యక్షులు దుర్గాధ్యక్షులుగా నుండిరి. తమ ధర్మమును హృదయపూర్వకముగా నిర్వహింపవలయునా వలదా? ఏవేళ్ళ కే బెడద వచ్చునో తెలియదు. కాని మహాభీతిచేతఁ దల్లడిల్లుచున్న రాజాధికారు లందఱు తమ విధ్యుక్తధర్మమును, సూర్యుఁడు తన యుదయాస్తమయములను నిర్వహించుచున్నట్టు నిర్వహించుచుండిరి. అందరికిని భయము కలదు. భయము లేనివాఁ డొక్క నీలాంశుఁడు మాత్రమే. నీలాంబరునకు భయము లేదు గాని దాని బదులు కోపము కలదు. నిరాదరణ కలదు. అతఁ డి ట్లూహించెను. 'మిహిరకులుఁడు తాను తన దేశమునకుఁ బోవుముందు న న్నేల రాజుగా నిర్ణయించిపోలేదు. నీలాంశుని జేయునా? రాజునకు నీలాంశుఁడు నాయంతటి సన్నిహితుఁడు కాడు. నీలాంశుఁడు నాయంతటి శూరుఁడు కాఁడు. వానిని రాజును జేసినచో నే నీ రాజ్యమునందే యుండను. ఎందు కుండను? ఉందును. ఉండి నీలాంశుఁడు రాజ్య మెట్లు చేయునో చూచెదను. రాజ్యము చేయుట యనఁగా వేదాంతములు చెప్పుటయా?' ఇట్లు భావించు నీలాంబరుఁడు తానే రాజువలెఁ బ్రవర్తింప నారంభించెను. మఱియు నతఁ డధ్యక్షుఁడుగా నున్న దుర్గము రెండు మూఁడు పెద్ద దుర్గములలో నొకటి. అది పుష్కలావతికి సమీపమున నున్నది.

నీలాంశుఁ డధ్యక్షుఁడుగా నున్న దుర్గము పుష్కలావతికి దూరమున నున్నది. నీలాంబరుఁడు మాటిమాటికి రాజధానికి వచ్చును. బంధువుల నందఱను చేరఁదీయును. వారి యిండ్లకుఁ దానే పోవును. రాజ్యమునకుఁ దానే యర్హుండ-నని చెప్పుచుండును. నీలాంశునిమీఁద ద్వేషమును గ్రక్కును. రాజధానిలో నీలాంబరుని పక్షము పెరిగెను. నీలాంశుఁడు రాజ్యమును వాంఛించుచున్నట్లే లేదు. అతఁ డెవ్వరి యొద్దకుఁ బోవుటలేదు. ఎవ్వరి నాశ్రయించుట లేదు. నీలాంబరుని ద్వేషించుటలేదు. నీలాంబరుఁ డిప్పుడు రాజు నెదిరింపవలయును. తాను బలవంతముగా రాజ్యము నాక్రమింపవలయును. అతని పక్షమునం దున్న యెవ్వరు దీని కంగీకరింపలేదు.

రాజు వృద్ధుఁడైనమాట నిజమే. కాని యెంతవృద్ధుఁడు? అరువదియారేం డ్లున్నవి. వందయేండ్లు బ్రతికినవా రున్నారు. బ్రదుకుచున్నవా రున్నారు. మరణపర్యంతము కాలుచేతు లాడెడివా రున్నారు. బుద్ధిబలము తగ్గనివా రున్నారు. రాజు వారిలో నొకఁడు.

కొతుమీఁద యిఖకాంయిచటి నల్లని సామర్థ్యమునందలి విశ్వాసముచేత నల్లఁడు వచ్చి తన రాజ్యమును జక్కదిద్దుకొనుట లేదని కోపముచేత నైరాశ్యజనితవైరాగ్యముచేత నూరకున్నాఁడు గాని లేనిచో నెవరో కొందఱే గూడుపుఠాణి జేసి రాజ్యమునందు తిరుగుబాటు నేర్పాటుచేసినచో దాని నణచలేనంత శక్తిహీనుఁడు కాఁడు. అది యట్లుంచి మిహిరకులుఁడు వెనుదిరిగి చూచినచో నెదురుతిరిగినవారందఱు భస్మసాత్కృతు లగుదురు. నీలాంబరుఁడు కుఱ్ఱవాఁడు. రాజ్యలోభము కలవాఁడు. క్రాగుచున్న పాలు. ముందు వెనుక లరయఁడు. పెద్ద లందఱు సాదర మందహాసములతో నీలాంబరుని మాటలను త్రోసిపుచ్చెదురు. రాజ్యము మాత్రము భద్రముగా నున్నది.

మిహిరకులుఁడు కాశ్మీరమున బంధితులకు విధింపఁబడిన శిక్షలను దినదినము సాయంకాలములయందు నెఱపఁబడుచుండఁగా వానిని జూచుచు సంతోషించుచుండును. నిష్కరుణితోపాటు నిష్కరుణముగాఁ గ్రూరముగా జరిగెడి వధలను జూచి యానందింపఁదగినవారు తద్వధల నాచరింపఁదగినవారు పదిమంది కలరు. శిక్ష విధింపఁబడినవారు వేఱొకచోటికిఁ దీసికొనిపోఁబడుదురు. అచట నెత్తైనగోడలు రెండునిలువులయెత్తున గవాక్షము లున్న కొట్లు. పదిగోడలు దూఁకినగాని పాఱిపోవుటకు వీలులేని కారాగృహములు. వానిలో నుంపఁబడుదురు. ఆ కారాగృహముల చుట్టు పదిప్రాకారములు. చివరిరెండు ప్రాకారముల యొక్క నడుమనున్న ప్రదేశము సుంత విస్తీర్ణమైనది. అందులో నొకచోట నున్నతమైన వితర్దిక. దానిపైన రాజు కూర్చుండు నాసనము. ఒకనితరువాత నొకబంధితుఁడు తీసికొనిరాఁబడును. వానిని చిత్రవధ చేయుదురు. వాని నొకసారి చంపరు. మలుగులలో సంధులలో బొమికలమీఁద గునపములతోఁ బొడుతురు. వాని యేడ్పులు మిహిరకులుఁడు వినుచుండును. అతని కానందము కలుగుచుండును. ఎచ్చటఁ బొడిచినచో వాని రోదనము పరమవికారముగా నుండునో పరమబాధాసూచికముగా నుండునో యా రోదనమును దెలిసికొని మిహిరకులుఁడు బంధితుల నచ్చటఁ బొడిపించును. అతనికిఁ బురుషుల రోదనధ్వనులకంటె, స్త్రీల రోదనధ్వనులయం దధికానురాగము. వారి నట్లు హింసించును. ప్రతిదిన మింత హింస యయినతరువాత స్నానపానాదులు చేసి భోజనము చేసి కల్యాణవతీ సౌధమునకుఁ బోవును. ఈ రెండానందముల కేమి పొత్తో తెలియదు. భర్తయొక్క యీ వికృతమైన యానందముయొక్క లక్షణము కల్యాణవతి యెఱుఁగదు. తన సౌధమునకు వచ్చిన రాజు మెత్తనిసంగీతమును మెచ్చికొనును. తనయొక్క యాంగికములైన హేలలకుఁ బ్రశంసించును. తనయందు బద్ధానురాగుఁడు భార్యయందు నింతటి సమార్ద్రచిత్తుఁ డయినవాఁడు క్రూరుఁడగునా? అతనియెడఁదవెన్న. అతనినిగూర్చి వేఱొక యూహ వచ్చుటయే యనంభవము. క్షారజలమయమైన సముద్రము పొంగు ననుకొందుముగాని మధురశిశిరజలపూరితమైన కాసారము పొంగి యూళ్ళను బాడుచేయునా? ఆ యూహ యెవ్వరికిని రాదు. అందుచేతఁ గల్యాణవతీదేవి భర్తయొక్క స్వరూపము నెఱుఁగదు. దినదినము మిహిరకులుఁడు కల్యాణవతీ ప్రేమసుధాక్షీరసముద్రమున నమృతపుఁ గాలువలు ప్రవేశింపఁజేయుచునేయుండెను. ఆమె పొంగుచునేయుండెను. వాని రాకకు నామె ప్రేమసాగరము పొడిచివచ్చును. అతఁడు రాచకార్యములపై పోయినప్పు డది యాటుమీఁద నుండును.

కల్యాణవతీదేవికిఁ బుష్కలావతినుండి తఱచుగా వార్తలు వచ్చుచునేయుండును. గాంధారమున మిహిరకులుఁడు చేయించిన మ్లేచ్ఛవధ కథలు కథలుగాఁ గల్యాణవతికిఁ జేరెను. ఆమె నమ్మలేదు. సహజముగా దోషులను శిక్షింతురుకదా! మ్లేచ్ఛు లీ దేశమును సమాక్రమించుటకు వచ్చి నెఱపిన దుండగములను శిక్షించుటలో దోస మేమియు లేదు. శిక్షాకాలమున నొకప్పుడు కొంత పెచ్చుజరగవచ్చును. ఒకఁడు చేసిన శిక్ష యొకనికి విడ్డురముగా నుండవచ్చును. ఈ రీతియైన సమన్వయముచేతఁ గల్యాణవతీదేవి భర్తమీఁద నీసుపొందలేదు. అతనినిగూర్చి విపరీతముగా భావింపలేదు. మఱియుఁ గొన్నివార్తలు వచ్చినవి. వానిలో మిహిరకులుఁడు తనవెంట పలుమంది దుర్గాధ్యక్షులను రాజాధికారులను బంధితులనుగాఁ దెచ్చెను. వారిని విచారించి శిక్షలు విధించి నిర్దోషులయినవారిని వదలిపెట్టుదు మని చెప్పెను. అట్టివారిని సాధువుగా విచారణ జరిపించవలసినదనియు, నెట్లో యొకట్లు భర్తతోఁ జెప్పి వారిని విడిపింపఁజేయవలయుననియుఁ గల్యాణవతి నెఱిఁగియున్న పలుమంది స్త్రీపురుషులనుండి వార్తలు వచ్చుచుండెను. ఈ వార్తలు పంపినవారు కొంత యవివేకముగాఁ బంపుదురు. వారు కల్యాణవతి నెఱుఁగుదురు. ఆమె రాజదుహిత. ఆమె నాఱేండ్ల క్రింద నెఱుఁగుదురు. ఆమె వారి నాఱేండ్ల క్రింద నెఱుఁగును మా మేనత్తకొడుకు, మా పినతండ్రి బావమఱది మొదలైన వార్తలు కొందఱిదగ్గరనుండి వచ్చును. పంపినవారే యొకొక్కప్పుడు కల్యాణవతికి సరిగ జ్ఞాపకముండరు. ఆ బంధితుని యూరును బేరును వాఁ డేదోషముక్రింద నిర్బంధింపఁబడెనో.

యెపుడు నిర్బంధింపఁబడెనో మొదలైన వివరములు లేక యిట్టివార్తలు నిష్ప్రయోజనము లగుచుండును. కొన్నివార్తలు వివరముగా నుండును. వానిలోఁ గొన్ని కల్యాణవతికి దగ్గఱివారినుండి వచ్చును. అట్టివారినిగూర్చి కల్యాణవతి భర్తతోఁ జెప్పనెంచును. మిహిరుఁడు కల్యాణవతి యొద్దకు రాత్రి పదిగంటలకు వచ్చును. అతఁడు చాల శ్రమపడియుండును. వచ్చుచునే నిద్రాసుఁడై వచ్చును. మఱి యొకప్పుడు హఠాత్తుగా భూమి చీల్చికొని పొంగులెత్తు నంతర్ధాత్రిజలమయమయిన కేతకునివలె వచ్చును. మఱియొకప్పుడు వంలెక్కమహావాహిని సముద్రమునందు ప్రవేశింపఁబోవుచున్నట్లువచ్చును మఱియొకప్పుడుడస్సిపోయి వందయోజనములు ప్రయామహాశ్వమసజ్జితమై కొట్టమునకు విశ్రాంతి జెందిన కొఱకు మేతకొఱకు వచ్చినట్లు వచ్చును.అతఁడిన్ని విధములుగా రావచ్చుననిలేదు. ఆయన రాజకార్యములుచూచుకొని యొకప్పుడు భోజనముకూడ లేకుండఁ గల్యాణవతీసౌధమునకు వచ్చును. మహారాణియే యతనిభోజనము నమర్పవలయును.

దినదిన మిట్లుండ మాసములు గడచును. సంవత్సరములు గడచును. ఆమె యెవరిని గుఱించి చెప్పుటకును వీలు లేకుండెను; ఒకటి చాలవిచిత్రమైన విషయము; అతఁ డేకపత్నీవ్రతుఁడు. అతనికి మఱియొక భార్య లేదు. మిహిరకులునకుఁ దమ కూతుండ్ర నిచ్చి బంధుత్వము కలిపికొని గొప్పయధికారములు సంపాదింపవలయు ననియు, రాజప్రతిపత్తి పొందవలయు ననియుఁ జాలమంది ప్రయత్నించిరి. ఆ ప్రయత్నము లన్నియు వ్యర్థ మయ్యెను. ఇట్టివి తొట్టతొలుతఁ గొందఱు వృద్ధ ధాత్రులచేతఁ బ్రస్తావింపఁజేయబడును. రాజునకుఁ బ్రియమైన ముసలిదాదులు నలుగురు కలరు. వారు చిన్నప్పుడు మిహిరకులుని పెంచిరి. అప్పుడప్పుడు స్తన్య మిచ్చిరి వారి పరిచయము, వారి ప్రేమ మిహిరునకుఁ బదుమూఁడు పదునాలుగేండ్లు వచ్చువఱకే సన్నగిలిపోయెను. తరువాతఁ గొన్నియేండ్లు వారు వచ్చుటయు, వారే పలుకరించుటయు. మిహిరుఁడు వారిని బలుకరించుటలేదు. వారు దూరమున నిలుచుండి ప్రేమ చేత నిండిన కనులతో నతనిని జూచెడివారు. అతఁడు వారిని బరిహరించెడివాఁడు. ఒక వేళ వారివంకఁ జూచినను తన కేమియుఁ బట్టనట్లు చూచెడివాఁడు. మఱియతఁడురాజగు వేళకు వారు చిన్నప్పుడు పాలిచ్చిన దాదులు కానట్లే యయిపోయిరి. రాజప్రాసాదమున వారికి గృహములు కలవు. పోషణ కలదు; ఒకవిధమైన మర్యాద కలదు. దాని కెప్పుడును భంగములేదు. ఇట్టిదాదులు పోయి రాజుతో నేమని చెప్పవలయును. అతఁ డేకాంతముగా నున్నప్పుడు పోవలయును. అతని యేకాంతసమయములు కనిపించుట లేదు.

పూర్వపురాజులు దినమునందు జామైనను భోగములకు వినియోగించుకొనుచుండెడి వారు. అంతఃపురమున సంగీతములు, నృత్యములు, వినోదములు పెక్కు లుండెడివి. ఆసమయములం దందఱును పోయి మాటాడెడివారు. తమ సొదలు వెళ్ళఁబోసికొనెడివారువారు. తమ పరిచయము నుద్దీపింపఁజేసికొనెడివారు. రాజు దమవంకఁ జూచుటయో చిఱునవ్వు నవ్వుటయో తమతోఁ జిన్నమాట యనుటయో యాజ్ఞాపించుటయో మొదలైనవి జరుగుటచేతఁ దరతమభావమునఁ దమకృతార్థిత్వమును దా మనుభవించి తృప్తిపడెడివారు. ఈ రాజువిషయమున నట్టి వేమియు లేవు. ఇతఁడు ప్రొద్దుట లేచును. కాల్యకృత్యములు తీర్చికొనును. కొంత ప్రాతరాహ్నికమును నెరవేర్చును: తరువాత ప్రొద్దెక్కువఱకునశ్వారోహణమో, గజారోహణమో చేయును నిచ్చలు సేనల యొక్క పరిస్థితులనేగమనించును.ఏనుగులను గుఱ్ఱములను బరిశీలించును. క్రొత్తవానిని కొనును. ప్రొద్దెక్క తన సౌధమునకుఁ బోయి స్నానాదికృత్యము లొనర్చి భోజనము చేయును. భుజించినతరువాత కొంత విశ్రాంతి పొందును. తత్కాలమున రాజు నొద్ద కెవ్వరును బోవుటకు వీలు లేదు. అదిమొదలు ప్రొద్దు వాటారువఱకుఁ బ్రతిదినము రెండుకార్యములు నిస్సందేహముగాఁ జేయును. వెనుకటిదినమున జరిగిన నిర్ణయములను ధర్మాధ్యక్ష సభాధ్యక్ష దండపాలురు వచ్చి విన్నవింతురు. ఇట్లిట్లు జరిగిన దనిచెప్పుదురు. తమకు క్లిష్టములైన యంశముల నుగ్గడించి రాజుయొక్క యిష్టము నడుగుదురు.

ఈ పని యయినతరువాత రాజు విలుకాండ్రయొద్దకుఁ బోవును. విలుకాండ్రు పదివేలమంది కలరు. వారివిషయములు పరిశీలించును. ప్రతిదినము కొన్నివందల బాణములను వందధనుస్సులను క్రొత్తవి రావలయును. రాజు ప్రతిధనస్సును తాను విచారించును. వంచి చూచును. ఆకాలమున ధనస్సులకు మిక్కిలి మర్యాద కలదు. మిహిరకులునకుఁ బూర్వమునఁ బదాతు లందఱు ధనుర్ధారులు. ప్రతికాలిబంటునకు నొక వెడల్పైన పొడుగైన ఖడ్గము, నెద్దుచర్మముతోఁ జేసిన డాలును తప్పకుండా నుండును. తత్పూర్వము ప్రతివానియొద్ద నొక ధనుస్సుండెడిది. మిహిరకులుఁడు ధనుర్ధారులను వేఱుచేసెను. కత్తి నుపయోగించినచో ధనువు నుపయోగింపరాదు. ధనువు నుపయోగించినచోఁ గత్తి నుపయోగింపరాదు. కాని ధనుర్ధారులయొద్దమాత్రము కత్తు

లుండెడివి. ధనువును ధరించువారి తనూదైర్ఘ్య మెంతయో ధనువుయొక్క దైర్ఘ్య మంత. కాశ్మీరీయులు ధనువు నుపయోగించెడి పద్ధతి వేఱు. భారతకాలమున ధనుస్సులు చేతియందుఁ బూని వింటిత్రా డెక్కువెట్టి బాణములు సంధించెడివారు. ధనుస్సునకు ధాత్రికి సంబంధములేదు. వారి ధనుస్సు లెంతపెద్దవైనను వా రడ్డముగానో నిలువుగానో యాకాశమునందే దానిని వంచుటయు బాణమును సంధించుటయు విమోచనము చేయుటయు జరిగెడిది. ఆనాటి యమ్ముల ప్రమాణములు వేఱు. ధనుస్సుల ప్రమాణములు వేఱు. ఈనాఁడు వేఱు. ఈనాఁడు ధనుర్ధారియొక్క శరీరప్రమాణ మునుబట్టి ధనుస్సులు చేయింతురు. ధనుర్ధారు లయిన సైనికులలోఁ జేరెడివా రందఱు తొలుత సామాన్యమైన ధనుస్సు లతో నభ్యాసము చేయుదురు వారి యభ్యాసము పూర్తియయినతరువాత వారివారి ధనుస్సులు వారికి వచ్చును. ఒక్కొక్కనికి రెండుమూఁడు ధనుస్సు లుండును. ధనుర్ధారి ధనుస్సును నేలమీఁద నానించును. దానిని వాఁడు తన యెడమ కాలితో నొక్కి త్రాటిని లాగి బాణమును వదలును. బాణము సుమారు మూఁడు గజముల పొడుగుండును. ఆ బాణము నెదుర్కొనుట సాధ్యమేకాదు. ఆ బాణము డాలును వక్షఃకవచమునుగూడ సులభముగా భేదించును. అది యానాటి ధనుర్లక్షణము. దీనిని మిహిరకులుఁడు ప్రత్యేకమైన మహాసాధనముగాఁ జేసెను. ఆ యమ్ము పోయెడి వేగముగాని దాని చివర ననుసంధింపఁబడిన మిక్కిలి వాడియయిన యయశ్శకలముగాని చూచుటకే భయము కొలపున ట్లుండును.

మిహిరకులునకు గజసైన్య మెక్కువ యిష్టమో యశ్వసైన్య మెక్కువ యిష్టమో ధనుర్ధారు లెక్కువ యిష్టమో తెలియదు. ధనుర్ధారిసైన్యమునకు వందమంది యాచార్యులు కలరు. వారిమీఁది సర్వాధికారి ద్రోణాచార్యుఁడు. కౌరవపాండవుల ధనుర్గురులైన ద్రోణాచార్యుని పేరు మిహిరకులుని సైన్యమున నొకపదవి ననుసరించువాని యధికారనామ మయ్యెను. ద్రోణాచార్యుఁ డనఁగా సర్వధానుష్క మహాసేనాధిపతి యని యర్ధము. మిహిరుఁడు ప్రొద్దు క్రుంకఁబోవుచుండగా నిష్కరుణునియొద్దకుఁ బోవును. ఆ కారాగారములయందు వాని భార్య యెవ్వరికిని దెలియదు. సూర్యాస్తమయ మగువఱకు నచ్చటనే యుండును. అచట సాయాహ్నికమును దీర్చును. తరువాత నతఁడు శరీరవ్యాయామమును జేయును. అతని వ్యాయామ మంతయుఁ బ్రతిదినము ప్రొద్దుగుంకినతరువాత ప్రొద్దుపోవువఱకును. ప్రాతఃకాలమున శరీరవ్యాయామము చేయఁడు. గుఱ్ఱముమీఁదనో యేనుఁగుమీఁదనో తిరుగుటయే ప్రాతఃకాల వ్యాయామము. ప్రాతఃకాలముల నొక్కొకప్పుడు పర్వతముల నధిరోహించును. ఇట్టి యీ దైనందినచర్యయందు లేశమాత్రమైనను విరోధము కలుగదు. కొన్ని. పండుగలు పబ్బములు నుత్సవములు ఘటిల్లినపుడు రాజు వీని నన్నిటిని వదలిపెట్టును. రాజసౌధమునకు ముందరగా చతుస్రమైన విశాలప్రదేశమున సింహాసనముమీఁద గూర్చుండి యుత్సవములను జూచుచుండును. ఒక్కమాట మాటాడఁడు. అన్నిటిని సశ్రద్ధాకముగాఁ బరిశీలించుచుండును. ఆ యుత్సవసమయములం దెవనిదైన ప్రవర్తన విద్దూరముగ నున్నచో రాజసభామర్యాదాపేతముగ నున్నచో మఱునాఁడు వానిని బిలిపించును. రాజు పిలిపించె ననఁగా వాఁడు తిరిగి యింటికిఁ బోఁడని యర్థము. ఆ యుత్సవములందుఁ బాల్గొనినవారిలో నెవఁడైన తాను ప్రదర్శించిన విద్యలో జురుకుదనమును జూపెనేని, నేర్పునువెలయించెనేనియౌచిత్యమును వెలార్చెనేని మఱునాఁడు వానియింటికి వందదీనారములు పోవును. ఉత్సవములైన మఱునాఁడు మిహిరకులుఁడురద్వాపాలునితో నంతర్వేశికునితో జాము రెండుజాములు కూర్చుండును. వారివారిపేరులు తెలిసికొనును ఈ శిక్షయో, సమ్మానమో జరుగును. జురా యొక్క యిట్టి కరుణచేత నిట్టి తీవ్రతచేత దేశమునందు భయభక్తులు నిండియుండును.

రాజు దినచర్య యిట్లుండఁగా జిన్నప్పటి ధాత్రిజనము పోయి వానితో మాటాడుట యెట్లు? అయినను వా రెక్కువ చనువుతీసికొని మూఁడునాల్గుసార్లు మాటాడిరి. తద్గుర్గాధిపతి ఆయనకు ముగ్గురు కూతుండ్రు. రాజులు బహుభార్యాకులు. అతఁడు మన రాజ్యపు టెల్లలను సంరక్షించెడివాడు. మహారాజుతో సంబంధము కలిపికొననెంచుచున్నాఁడు. ఈ నాల్గుమాటలు చెప్పుటకును వీలుండదు. ఒకప్పు డతని పేరు చెప్పినంతనే రాజు పెదమొగము పెట్టును. ధాత్రిని వెడలిపొమ్మనును. ఒకప్పుడు ధాత్రి తుదిముట్టఁ జెప్పినచో రా జిట్లనును. 'ఎంతమందియో రాజకుమారులు కలరు. నే నేకపత్నీవ్రతస్థుడను. కాదుకూడ దన్నచో మహారాణిని కలిసికొనుము. ఆమె యంగీకరించినచో నప్పుడు చూతము. ఇట్లన్న యొకటిరెండు సందర్భములయందు ధాత్రి పోయి మహారాజ్ఞితోఁ జెప్పుటయు నామె తన కభ్యంతరము లేదనుటయు. రాణి యభ్యంతరము లేదన్నమాట. రాజుతోఁ జెప్పుటకు నెలలు పట్టుటయు నతఁడు 'ఇది యెన్నాళ్లైనది? మూడునెలలైనదా? రాణిగా రప్పు డట్లనిరి. ఇప్పు డేమందురో కనుగొనుము' అని చెప్పుటయు, ధాత్రు లీ వ్యవహారమునుండి విరమించుకొనిరి. ఈమాటలు మిహిరకులుఁడు కల్యాణవతితో ననఁడు. కల్యాణవతి భర్తతోఁ జెప్పదు అది యెదో తమకు సంబంధములేని వ్యవహారము సుంతదవ్వున గాలిలో పట్టించుకోనక్కఱ లేకుండ దూసికొనిపోయినట్లుండును. ఇది యిట్లుంచి కల్యాణవతి గాంధారము నుండి వచ్చిన కొందఱాప్తులయొక్క వ్యవహారములను మిహిరకులునితోఁ జెప్పుటకే వీలులేకుండనుండెను. రాజ్యము నిష్కం

టకముగ నుండెను. ధర్మమునాల్గు పాదముల నడచుచున్నట్లుండెను. పూర్వులు ధర్మము గోవనియుఁ గలికాలమున దాని కొక్కపాదమే యుండుననియు వ్రాసిరి. మిహిరకులుని రాజ్యమున నాలుగుపాదములతో నాగోవు సంచరించుచున్నట్లుండెను.

కాని దినదినము సాయంకాలములయందు గారాగారమునందయిదవయాఱవ ప్రాకారములనడిమి సుంతవిశాలప్రదేశమున నా గోవునకు నాల్గవకాలుకూడ లేకపోవుటయే కాదు, ఆగోవే లేదు. గోవు కాకపోయిన మానె బఱ్ఱెకూడఁగాదు. అది యొక తోడేలో, సివంగియో తెలియదు. దానికిఁ గాళ్ళు మాత్రము పదియో పండ్రెండో. ఇది యెట్లున్నదనఁగా నా కారాగారమే లేనిచో మిహిరుని దౌరాత్మ్యము క్రౌర్యము ప్రజలను మ్రింగివేయునేమో యనిపించును. ఒక్కొకఁడు మహావ్యాధిగ్రస్తుఁడయియుండును. ఆ వ్యాధి కనిపించరానివ్యాధి. దాని బాధ యెక్కువ. ఆబాధ యెక్కువయినపుడు నిర్జనప్రదేశమునకుఁ బోయి దాని ననుభవించి తరువాత మరల సంఘములోనికి వచ్చి సామాన్యులవలె నందఱితోడిపాటు మానిసివలె విహరించును, నవ్వును, పరాచికములాడును. మిహిరకులుని కథ యిటున్నది. భేదమేమనఁగా నితఁడు తన మహావ్యాధిని దినదినము సాయంకాలమునందే యనుభవింపగల నియమము చేసికొనెను. ఆవ్యాధి వాని యదుపులో నున్నది. ఇంత యదుపులోనున్న వ్యాధిని దత్కాలమున గూడఁ దనదగ్గరకు రాకుండ నదుపులో పెట్టికొనవచ్చు ననిపించును. కాని యట్లు చేయరాదేమో యనిపించును. అది వ్యాధి. దాని ననుభవించితీరవలయును. దాని కట్టనియమమేర్పరచనిచో నది సర్వకాలములయందు బాధించును. ఒటఁబుట్టిన వ్యాధిని బరిహరించుట యెట్లు? బాహిరములైన హేతువుల చేత వ్యాధులుద్భవిల్లినచో వాని నౌషధసేవచేతఁ బరిహరింపవచ్చును. కొన్ని తరములనుండి పితృపైతామహముగ నార్జింపఁబడిన కొన్నివ్యాధులు శరీరమునందుండును. అవి తొలఁగింపరానివి. అట్లే కొన్నిజన్మలనుండి యొకజీవలక్షణమునందొక హింసాప్రక్రియబీజముండును. దానిని నివారింపరాదు.

మిహిరకులుఁడు గాంధారము నుండి వచ్చినతరువాత నాలుగేండ్లు గడచెను. అప్పటికి మిహిరకులుఁడు రాజ్యమునకు వచ్చి పదియేండ్లయ్యెను. గాంధారమున మిహిరకులుని ప్రస్తావనయే లేదు. అందఱును మఱచిపోయిరి. అతఁడు రాజునకు జామాత. అంతకంటె నేమియ లేదు. రాజు మఱియు వృద్ధుఁడగుచున్నాడు. తొలుతటి నైరాశ్య వైరాగ్యములు వెనుకటికంటె నిబ్బడిగా ముబ్బడిగా నయ్యెను. కాని యొక్కటి యారాజ్యమునఁ బ్రబలముగా నుండెను. నీలాంబరుఁడు రాజువలెఁ బ్రవర్తించుచుండును. నీలాంకుఁడప్పుడప్పుడు కొంచెమెదురుతీర్చును. నీలాంబరుఁడు తీవ్రరూపము తాల్చును. నీలాంకుఁడు సర్దికొనిపోవును. నీలాంబరుఁడు మఱియు విజృంభించును. నీలాంబరుఁడు నీలాంకుని పలుమార్లు వధింపనెంచెను గాని వానికి సాధ్యము కాలేదు. మఱియు నెప్పటప్పటికి రాజకార్యములు ముంచుకొనివచ్చును వానిని నీలాంకుఁడే తీర్చిపెట్టవలయును. అందుచేత నీలాంబరుఁడు తనకుఁ గోపము వచ్చినప్పుడు నీలాంకుని వధింప నెంచినను గోపముపశమించినపుడు వాని యవసరమును గుర్తించుచుండును. తక్కిన దుర్గాధ్యక్షులు పైకి నీలాంబరు ననుసరింతురు. లోన నిందింతురు. నీలాంబరుని దుండగములను రాజుతోఁ బోయి చెప్పుదురు. రాజు మహామంత్రితో, మహాసేనాధిపతితోఁ జెప్పును. వారిని నీలాంబరుఁడంత లెక్కచేయఁడు. వారును నీలాంబరుని లెక్కచేయరు. వారి వ్యవహారములు వారు చేసికొందురు. ఇది ప్రజల కిరకటముగా నుండెను. మంత్రి సేనాపతుల శాసనములు వేఱు. నీలాంబరుని శాసనము వేఱు. నీలాంబరుఁడు కొంత సేనతో వచ్చి పన్నులు బలవంతముగా స్వీకరించును. ఆయా గ్రామములవారు పోయి మంత్రితో, సేనాపతితో, రాజుతోఁ జెప్పికొందురు. వారా గ్రామముల నుండి మరల పన్నులు స్వీకరింపరు. దుర్గాధ్యక్షుఁడు పన్నులను స్వీకరించును. వానిని దుర్గాధ్యక్షుఁడు రాజునకుఁ బంపవలయును. ఒక్కొకప్పుడు నీలాంబరుఁడే పోయి వారిని తన కిమ్మనును. ఇచ్చినచో సరే. ఈయనిచో నదియొక పెద్ద రచ్చ. ఒక దుర్గాధ్యక్షుని నీలాంబరుఁడు తొలగించి మఱియొకని నేర్పఱచును. మంత్రియు సేనాపతియు వచ్చి మరల తొలుతటివానినే నియమించి యచట నెక్కువ సైన్య ముంతురు. ఇట్టి వ్యవహారములు దినదినమును మితిమీఱి పోవుచుండగా రాజు తన కూఁతునకును మిహిరకులునకును వార్త పంపెను. 'మీరిద్దఱును వెంటనే రావలయును. ఈ రాజకార్యములను జక్కబెట్టుకోవలయును.' ఆ వార్త వచ్చిన తరువాత రాణి భర్తతో దాని ప్రస్తావన చేసెను. ఆయన 'నీ యిష్టమెప్పుడు పోదమన్నచో నప్పుడు పోద' మనెను కల్యాణవతికిఁ దెలియును. తానే యన్నియు సిద్ధము చేసి భర్తను బయలుదేరు మనఁగా నతఁడు బయలుదేరునుగాని లేనిచో నతని దినచర్య నతఁడు సాగించుకొనుచుండుడు. అందుచేతఁ గల్యాణవతి కాపురమునకు వచ్చిన తొలుతటి నాళ్ళలో నిష్కంటకుని వ్యవహారమున నొకసారి పదియేండ్ల తరువాత నిప్పుడు తండ్రియొక్క రాజ్యవ్యవహారమున నిప్పుడు రెండవ సారి జోక్యము కల్పించుకొనెను. పదియేండ్లైనను కల్యాణవతి రాజనీతిని మఱచిపోలేము. ఆమె దర్పమల్లుని బిలిపించెను. పాతికవేల సైన్యముతో రాజు గాంధారమునకుఁ బోవుచున్నాఁడని చెప్పెను. సభాధ్యక్షునకు, ద్వారపాలునకు, మంత్రి పురోహితులకు, నంతర్వేశికునకు, నగరాధ్యక్షునకు, రాష్ట్రాంతపాలునకు వార్తలుపంపి వారిని బిలిపించి తానును రాజును గాంధారములయందుండఁగా వారు పూనవలసిన బాధ్యతయుఁ, జేయవలసిన రక్షణయు విస్పష్టముగ వివిచ్యమానముగ నాదేశించెను, వారందఱు నివ్వెఱపోయిరి. 'ఈమె పదియేండ్లుగా మహారాణి. ఈమె యొక్కయీ సామర్థ్య మెవ్వరికిని దెలియదు. ఇంతటి పండితురాలు రాజకార్యములయందెందుకు జోక్యము కలిగించుకొనదు? భర్త యన్నచో నెంత గౌరవము, ఎంత మర్యాద! సామాన్య గృహిణివలెఁ బ్రవర్తించును. రాజకార్య పరిజ్ఞానము లేనిదానివలెఁ బ్రవర్తించును. దేనియందును దవతల దూర్చదు. ఆ రాజేకపత్నీవ్రతుఁడు. ఈమె సర్వ రాజకార్యములయందు వాని ననుసరించును. ఏమి దాంపత్యము!

[సశేషం]

# రష్యాలో విద్యాభివృద్ధి

రష్యాలో జరుగుతున్న విద్యావ్యాప్తి గురించి యిటీవల ప్రపంచం అంతటా ఆసక్తి కలిగించింది. దీనికి కారణాలు అందరకూ తెలిసినవే. రష్యాలోని విద్యా విధానం గూర్చి ప్రస్తుతదశలో జరుగుతున్న విద్యాభివృద్ధిని గూర్చిన విషయాలు భారతీయ పాఠకులకు తెలిసేరీతిగా యీ వ్యాసంలో వివరించడం జరిగింది.

ప్రథమంలో కొన్ని వాస్తవాలు క్రింద యివ్వ బడ్డాయి.

— అర్థశతాబ్దం క్రితం సువిశాల మైన రష్యాదేశంలోని ప్రజలలో 80 శాతం నిరక్షరాస్యులు ఉండేవారు. 1959 వ సం॥ జనాభా లెక్కల ప్రకారం రష్యాలో 9.82 శాతం ప్రజలు అక్షరాస్యులుగా ఉన్నారు. యీ విధంగా అంతా అక్షరాస్యులుగా ఉన్న దేశంగా రష్యా రూపొందింది.

1963 వ సంవత్సరంలో 3,778.000 మంది ఉన్నత విద్యాభ్యాసం (విశ్వవిద్యాలయం) చేసినవారు ఉన్నారు. 44 శాతం ఉన్నత, సెకండరీ విద్య అభ్యసించినవారి సంఖ్య 1000 కి 308 మంది ఉన్నారు. 44 శాతం కార్మికులు, 26 శాతం రైతులు ఉన్నత లేక సెకండరీ విద్య గరపినవారు ఉన్నారు.

1962-63 విద్యా సంవత్సరంలో 67,637.000 మంది విద్య నభ్యసిస్తున్నారు. (ఫ్యాక్టరీలలోని వివిధ అధ్యయన బృందాలలోను, రిఫ్రెషర్ కోర్సులలోను ఉన్న వారితో కలుపుకుని). ఈ విధంగా రష్యాలో ప్రతి మూడవవాడు విద్యాభ్యాసం చేస్తున్నా డనవచ్చు.

— నిపుణుల శిక్షణంలోను విద్యార్థుల సంఖ్యలోను అమెరికాతో కలుపుకుని యితర పశ్చిమ రాజ్యా లన్నిటికన్నా రష్యా అధిగమించింది. బ్రిటన్, పశ్చిమ జర్మని, ఫ్రాన్స్, ఇటలీల ఉమ్మడి జనాభా రష్యాతో దాదాపు సమానంగా ఉన్నా 1960 వ సంవత్సరంలో రష్యాలో పై దేశా లన్నిటాకలుపుకొని ఉన్న విద్యార్థుల సంఖ్యకు నాల్గు వంతులు ఎక్కువ ఉన్నది

— రష్యాలో ప్రాథమిక పాఠశాల విద్యనుంచి పోస్టు గ్రాడ్యుయేటు కోర్సు విద్యవరకు ఉచితంగా ఉంది. అంతేగాక రష్యాలో కళాశాలకు వెళ్ళడానికి విద్యార్థులు రుసుము చెల్లించడానికి బదులుగా వారికే చెల్లించడం జరుగుతున్నది. ఉదాహరణకు: నైపుణ్యంగల వృత్తి విద్యా సెకండరీ మరియు విశ్వవిద్యాలయం స్థాయి పాఠశాలలలోని విధ్యార్థులకు రాష్ట్రీ స్కాలర్ షిప్పులు, ఉచితంగా బస, విద్యార్థి హాస్టల్స్‌లో ఉచిత భోజనం ఏర్పాట్లు జరుగుతాయి.

సోవియట్ రష్యాలో విద్యావిధానం అస్థిపంజరం కాదు. ఎడతెగని తీవ్ర పరిశోధనలు, అనుభవాలు, ప్రజలలో వివాదాలు చర్చలు జరిగిన తర్వాతనే ప్రస్తుత విధానం రూపొందించడం జరిగింది. కేంద్రంలోని పత్రికలు, స్థానిక పత్రికలు అన్నీ విద్యారంగంలోని వివిధ సమస్యలను వివరించే వ్యాసాలను ప్రచురిస్తూ ఉంటాయి. అయితే రష్యా విద్యావిధానంలోని ప్రాతిపది కాంశాలలో దిగువ దెల్పిన వివిధమైన సంవిధానం కలిగి ఉన్నాయి:

*1. ప్రిస్కూల్ విద్య :-*

3-7 సంవత్సరాల మధ్య వయసుగల బాల బాలికలకు కిండర్ గార్టెన్స్ లేక 3 మాసాలనుంచి 7 సంవత్సరాల వయసు గల బాల బాలికలకు నర్సరీ పాఠశాలలు, కిండర్ గార్టెన్ల సంయుక్తసంస్థలు.

*2. పాఠశాల విద్య:-*

(అ) 7 సంవత్సరాలు ఆ పై బడిన వయసుగల బాల బాలికలకు నిర్బంధ విద్య క్రింద 8 సంవత్సరాల అసంపూర్ణ సెకండరీ సాధారణ పాఠశాలలు.

(ఆ) విశ్వవిద్యాలయం స్థాయి పాఠశాలలలో ప్రవేశానుమతి లభించే దశవర్ష సెకండరీ సాధారణ పాలిటెక్నిక్ పాఠశాలలు. ఈ పాఠశాల మొదటి 8 గ్రేడ్ల కార్యక్రమం, నిర్బంధ అష్టవర్ష పాఠశాలతో పోలివుంటుంది.

(ఇ) 1-3 సంవత్సరాల కోర్సులతో పట్టణ, గ్రామీణ వృత్తి విద్యా సాంకేతిక పాఠశాలలు. 8 సంవత్సరాల సాధారణ విద్యా ప్రాతిపదికపై యీ పాఠశాలలు రూపొందాయి. సాంకేతిక నిపుణత గల సమర్థులైన పనివారలకు శిక్షణ ఇవ్వడానికి యివి నిర్దేశించ బడ్డాయి.

(ఈ) సాధారణ సెకండరీ విద్య, ప్రత్యేక విద్యల గరిపే 3-4 సంవత్సరాల కోర్సుగల సాంకేతిక యితర ప్రత్యేక సెకండరీ పాఠశాలలు.

*3. ఉన్నత విద్య :-*

5-6 సంవత్సరాల కోర్సుతో విశ్వవిద్యాలయాలు, అకాడమీలు, సాంకేతిక సంస్థలు, వ్యవసాయం, బోధనాశిక్షణ, వైద్యవిద్యా సంస్థలు.

వ్యవసాయ, పారిశ్రామిక కార్మికుల ఉపయోగార్థం సాయంకాల పాఠశాలలు

(షిప్టు) సాంకేతిక పాఠశాలలు, ఉన్నత పాఠశాలలు ఉన్నాయి. వీటిలో కరెస్పాండెన్స్ కోర్సుకూడా వుంది.

ఈ విధంగా సోవియటు పౌరుడు ఎవ్వరైనా దిగువ తెల్పిన మూడు స్థాయిల విద్యార్హతలలో దేనినైనా పొందవచ్చు: (1) అసంపూర్ణ సెకండరీ విద్య (2) సెకండరీ విద్య (3) ఉన్నతవిద్య.

ఉన్నతవిద్యార్హతలు గల వ్యక్తి వివిధ స్కాలర్ డిగ్రీలనుకూడా పొందవచ్చు.

రష్యా విద్యా విధానం మొత్తం క్రింద తెల్పబడినది.

ఉన్నత పాఠశాలలు
(విశ్వవిద్యాలయం స్థాయి)
ఉదయం, సాయంకాలం, కరెస్పాండెన్స్

| | | |
|---|---|---|
| సాయంకాలం (షిప్టు) సెకండరీ సాధారణ పాఠశాల | సెకండరీ సాంకేతిక ఇతర ప్రత్యేక సెకండరీ పాఠశాల | సెకండరీ సాధారణ పాలిటెక్నిక్ పాఠశాల |

(ఉదయం, సాయంకాలం మరియు కరెస్పాండెన్స్)

| | |
|---|---|
| గ్రూపు, వ్యక్తిగత అప్రెంటిషిప్పు | వృత్తి విద్యాసాంకేతిక పాఠశాల |

8 సంవత్సరాల సాధారణ నిర్బంధ పాఠశాల

## ప్రీ-స్కూల్ సంస్థలు

అన్ని రకాల పాఠశాలలను రాష్ట్రమే నిర్వహిస్తుంది. వారికి బృహత్తర కార్యక్రమాలు ఉన్నాయి. స్థిరీకరించిన పాఠ్య పుస్తకాలు ఉన్నాయి. ప్రత్యేక పాఠశాలలుగానీ లేవు. ప్రవేశానికి విద్యార్హతలే ప్రాతిపదికగా ఉంటాయి. ప్రతివారికి సమాన అవకాశాలు యిస్తారు.

ప్రీ-స్కూల్ నిర్వహణ గూర్చిన వివరాలు దిగువ ఇవ్వబడ్డాయి:

## ప్రీ-స్కూల్ విద్య

రష్యాలోని ప్రీ-స్కూల్ విద్యా సంస్థలలో, తల్లిదండ్రులు, తమ పిల్లలను స్వచ్ఛందంగా చేర్పించవచ్చు. ఈ పాఠశాలలు జనబాహుళ్యంలో అధిక ప్రచారంలో ఉన్నాయి. వీటిలో ఎల్లప్పుడూ వసతికొరతే ఉంటుంది.

3 మాసాలనుండి 3 సంవత్సరాల వయసు బాలబాలికలకు అన్నివిధాలైన నర్సరీ పాఠశాలలు ఉన్నాయి. అందులో నియమితపోషణ, శ్రద్ధ, ప్రాథమిక శిక్షణ జరుగుతుంది. ఈ పాఠశాలలు జనబాహుళ్యంలో ప్రచారంలో ఉన్నాయి. వీటిని డిటస్కీసాడ్—"బాలల ఉద్యాన వనం" అంటారు. జర్మన్ భాషలో "కిండర్ గార్టెన్" అంటారు. వీటిలో 3 నుంచి 7 సంవత్సరాల వయసు గల బాలబాలికలకు ప్రవేశం లభిస్తుంది.

పట్టణ ప్రాంతాలలోని నివాస ప్రదేశాలలో కిండర్ గార్టెన్‌లకై ప్రత్యేకంగా నిర్మించబడిన రెండు అంతస్థుల భవనాలు ఉంటాయి. ప్రతి దానిలో బాలబాలికలు భోజనం చేయడానికి భోజన శాలలు, పుస్తకాలు, ఆటబొమ్మలు, భోజనానంతరం అల్పనిద్రకై పడకగదులు గల రిక్రియేషన్ వసతి ఉంటాయి. ఈ భవనాలకు ఆటస్థలాలు ఉంటాయి. తల్లిదండ్రులు తమ పనిలోకి వెళుతూ పిల్లలను యీ కిండర్‌గార్టెన్లో వదలివెళ్తారు: పనిరోజు పూర్తి అయిన తర్వాత తిరిగి పిల్లలను తమవెంట గృహానికి తీసుకెళ్లుతారు.

ప్రజావిద్యాశాఖ కిండర్‌గార్టెనులను నిర్వహిస్తుంది. అయితే వీటిలో చాలా వాటిని పారిశ్రామిక సంస్థలు, వివిధ సంస్థలు, ప్రభుత్వ మరియు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు నెలకొల్పుతాయి. కిండర్‌గార్టెన్స్‌లో ప్రత్యేకంగా శిక్షణ పొందిన ఉపాధ్యాయులు బోధన చేస్తారు. ప్రతిదానిలో వైద్యచికిత్సకు డాక్టరు ఉంటాడు. వీటి నిర్వహణ కయ్యే ఖర్చులో ఎక్కువ మొత్తాన్ని ప్రభుత్వం భరిస్తుంది. తల్లి దండ్రులు తమ ఆదాయాన్ని అనుసరించి నామమాత్రంగా కొంతఫీజు యిస్తారు.

కిండర్‌గార్టెన్‌లో బాల బాలికలు ఏ విధంగా కాలం గడుపుతారు?

బాల బాలికల వయసు, సామర్థ్యాలకు అనుగుణంగా తగు శ్రద్ధతో ప్రభావితం చేసిన యెడల చిన్న వయసులోనే వారు విద్యాప్రభావానికి త్వరగా లోనౌతారని ప్రిస్కూల్ విద్యావేత్తలు అంటారు.

క్రమపద్ధతి, ఆరోగ్యకరమైన పరిసరాలూ, దేహ కసరతూ, బాహ్యజీవితం మొదలైన మార్గాలద్వారా బాల బాలికల దేహ దార్ఢ్యం పెంపొందింప జేయడమే ప్రధాన ఉద్దేశం.

పిల్లల మానసిక అభివృద్ధి అనేది విద్య ప్రధాన ప్రయోజనాల్లో మరొకటి. ఉపాధ్యాయులు పిల్లల మానసిక పరిధులను విస్తృత పరచేందుకు నిరంతరంగా శ్రమిస్తారు. వారు మాట్లాడడానికి తోడ్పడతారు. కాస్త వయసు వచ్చిన పిల్లలకు పది అంకెలవరకు లెక్కించడం, తేలిక పుస్తకాల్ని చదివించడం నేర్పుతారు. చాలా కిండర్‌గార్టెన్‌లలో విదేశ భాషల్నికూడా పిల్లలకి నేర్పుతున్నారు.

పిల్లల నైతిక విద్యకు కూడా సమాన ప్రాధాన్యత యివ్వడం జరుగుతుంది. వాళ్ళల్లో స్నేహభావం, అణకువ, పెద్దల ఎడ, తల్లిదండ్రుల ఎడ గౌరవం, సత్యభాషణ, సక్రమ విధుల నిర్వహణ వంటి సద్గుణాలను కలిగించే, అభివృద్ధి పరచే విద్యను వారలకు గరపబడుతుంది.

కళాదృష్టి పిల్లల్లో కలిగించే విద్యను

గరపడంతో శ్రద్ధ తీసుకుంటారు. పిల్లలకు సంగీతం, నృత్యం, వక్తృత్వం, మోడలింగువంటివి నేర్పుతారు. ప్రతి కిండర్ గార్టెన్‌లోనూ తరచుగా సంగీత నృత్య ప్రదర్శనలు ఆ పిల్లలచేతే ప్రదర్శింపబడుతుంటాయి. దానికి పిల్లల తల్లిదండ్రులే ప్రేక్షకులు. ఏ పాటో పాడుతున్న ఏ చిన్నపిల్లడి తల్లో, లేదా నృత్యం చేస్తున్న ఏ చిన్నపిల్ల తల్లో తమ పిల్లల ప్రదర్శన చూస్తూ గర్వంతో, ఆనందంతో ఆనంద బాష్పాలు కార్చడం మీకు అక్కడ కనిపిస్తుంది. ఈ విధమైన సంగీత, నృత్య ప్రదర్శనలు బహుళ ప్రచార మందినవి. తరచుగా వాటిని రేడియోలు, టెలివిజన్ల ద్వారా ప్రసారం చేస్తుంటారుకూడా.

కిండర్‌గార్టెన్‌లలో పిల్లలకు శరీరం వంచి పనిచేసే ప్రాథమిక విద్య నేర్పుతారు. పిల్లలు అక్కడి మొక్కల్ని, జంతువుల్ని సాకుతుంటారు. చిన్న చిన్న లక్కపిడతలయిళ్ళు కడుతుంటారు.

ముఖ్యంగా విద్య నేర్పే సాధనం ఆటలు. రోజుకు మూడునుంచి నాలుగ్గంటలపాటు వివిధ ఆటల్ని నేర్పుతారు.

ఆ విధంగా కిండర్‌గార్టెన్‌లో పిల్లలకు అన్ని రకాల విద్యా లభ్యమౌతుంది. సాధారణ విద్యాపాఠశాలలో మొదటి తరగతిలో చేరడానికి అర్హుడుగా అక్కడ పిల్లలు రూపొందుతారు.

## పాఠశాల విద్య

సెప్టెంబరు మొదటి రోజు రష్యా అంతటా ఓ పెద్ద సంబరంతో కూడుకున్న రోజులాంటిది. ఆ రోజు సుమారు 2,00,000 పాఠశాలలు సెలవుల అనంతరం తిరిగి తెరవబడతాయి. అన్ని నగరాల్లో, ఊళ్ళల్లో, గ్రామాల్లో ఆనందంతో గంతులువేస్తూ పాఠశాలలకువరుగులుతీసే అందమైన బట్టల్లోని అబ్బాయిలతోనూ; మట్టిరంగు ఫ్రాకులు, దానిమీద తెల్లటిగుడ్డపట్టీలతో, చేతులో పూలతో పొట్టిజడల అమ్మాయిలతోనూ వీధులు కలకలలాడుతుంటాయి. రష్యాలోని పాఠశాలలన్నీ సహవిద్యా పాఠశాలలే. ఏడేళ్ళలోపువాళ్ళంతా మొదటిగ్రేడు క్రింద లెక్క.

ఇతర భవనాలనుంచి పాఠశాలల్ని సులభంగానే గుర్తించవచ్చు. వాటి స్వరూపమే వేరు. ఎర్రని యిటికల్తోనో, తెల్లని యిటికల్తోనో కట్టిన గోడలు, మూడు, నాలుగు అంతస్తులు, విశాలమైన కిటికీలు, భవనానికి అనుకుని ఆటస్థలాలు — వీటినిబట్టే చెప్పెయ్యొచ్చు. పిల్లలు ఎనిమిది, పదేళ్ళల్లో అధిక భాగాన్ని యీ భవనాల్లోనే గడుపుతుంటారు. ముందుగా ఓ పెద్దనడవా తగులుతుంది. అందులో ప్రసిద్ధ రచయితల, కవుల, శాస్త్రజ్ఞుల రూపచిత్రాలు గోడలకు వ్రేలాడుతూ వుంటాయి. వార్తాపత్రికలు గోడలకు తగిలించబడి వుంటాయి. ఆ నడవా రకరకాల పూల మొక్కల్తో అలంకరింసబడి వుంటుంది. తరచుగా గోడలకూ, నడవాలోనూ ప్రసిద్ధ కళాఖండాల ప్రతిచిత్రాలుగాని, పిల్లల హస్తకళానైపుణ్యాన్ని చాటిచెప్పే చిత్తరువులుగాని అలంకరింపబడి కనిపిస్తుంటాయి. సాధారణంగా క్లోకు రూములు దిగువనే వుంటాయి. దిగువ అంతస్తులో ఫలహారాలశాల వుంటుంది. ఇక్కడ పిల్లలకు తక్కువధరకు వేడివేడి ఆహారం లభిస్తుంది. ఆ పై అంతస్తుల్లో తరగతి క్లాసులు, పఠనగదులు, భౌతిక, రసాయనిక శాస్త్రాలు మొదలగువాటికి సంబంధించిన లేబరేటరీలు, విదేశ భాషల తరగతి గదులు వుంటాయి. ఇంకా యిక్కడ వ్యాయామగది, అసెంబ్లీహాలు, అందులో ఒక ఎత్తయిన గద్దె, రేడియో గది, ఉపాధ్యాయుల గదులుకూడా ఉంటాయి.

ఆవరణలో అసంఖ్యాకమైన వర్కుషాపులు ఆవరించివుంటాయి. పాఠశాలలు పల్లెల్లోని వైనా, పట్టణాల్లోని వైనా యివన్నీ సాధారణంగా ప్రతి పాఠశాలలోనూ కనిపిస్తూనే వుంటాయి.

సెప్టెంబరు ఒకటవ తారీకుతో విద్యా సంవత్సరం ప్రారంభమై మార్చి 31—జూన్ 25 మధ్య ఏదో ఒక తారీఖుతో ముగుస్తుంది. ఈ విద్యా సంవత్సరం నాలుగు టర్మ్‌లుగా విభాగించబడుతుంది. ఒక టర్మ్‌కూ మరో టర్మ్‌కూ మధ్య సెలవులు వుంటాయి. ఆకురాలు కాలం సెలవులు (నవంబరు 5-9) చలికాలం సెలవులు (డిశంబరు 30-జనవరి 10), వసంత కాలం సెలవులు (మార్చి 24-31), వేసవి సెలవులు—ఆ తర్వాత విద్యా సంవత్సరం ముగుస్తుంది.

చిన్నవాళ్ళు రోజుకు నాలుగు పిరియడులు, వయసు యింకాస్త ఎక్కువ వుండి యౌవ్వనారంభంలో వున్నవాళ్ళు రోజుకు ఆరు పిరియడులు చదవాలి. నిజానికి హోంవర్కు అంటూ వుండదు. 45 నిమిషాలకు ఒక్కొక్క పిరియడు. పిరియడుకూ పిరియడుకూ మధ్య విరామం 10 నిమిషాలు. అయితే రెండో విరామం అర్ధగంట వుంటుంది. ఈ సమయం మధ్యాహ్న భోజనానికి ఉద్దేశించబడింది.

విద్యార్థుల విజ్ఞానాన్ని విడివిడిగా ఎప్పటికప్పుడు ప్రశ్నావళిద్వారా పరిశీలించడం జరుగుతుంది. ఉపాధ్యాయుడు వరసగా ప్రశ్నలు అడిగి వాళ్ళ విజ్ఞానాన్ని భేరీజు వేస్తాడు. పరీక్షలు నిర్వహిస్తాడు. వాటి ఫలితాలను ఆధారంగా చేసుకుని ఆ టర్మ్‌లో అతని విజ్ఞానాన్ని మార్కు చేస్తాడు. రష్యాలోని పాఠశాలలు విద్యార్థి విజ్ఞానాన్ని భేరీజు వేయడంలో 5—మార్కుల విధానాన్ని ఆచరిస్తుంటాయి. "5" గరిష్టమార్కు అన్నమాట ('అద్భుతం'), '4' (బావుంది), '3' ('సంతృప్తికరం'), '2' (బాగాలేదు), '1' (అసలు ఏమీ బాగలేదు), చివరి రెండూ ఫెయిలుచేసే మార్కులు. టర్మ్

ఒక్కొక్కరూ యిచ్చే మార్కులమీదే సంవత్సరాంతంలో యిచ్చే మార్కు ఆధారపడి వుంటుంది. సామాన్యమైన అభివృద్ధిని చూపించే విద్యార్థుల్ని ఆ తరువాతి గ్రేడులోనికి పంపిస్తారు. '3' కు తక్కువ వచ్చే వారిని క్రొత్త విద్యాసంవత్సరం ఆరంభమయ్యేలోగా మరొకసారి పరిక్షకు కూర్చోపెడతారు. రెండోసారి పరీక్షలోకూడా ఫెయిలయ్యిన విద్యార్థుల్ని అదే గ్రేడులో వుంచేస్తారు. ఎనిమిదేళ్ళ కోర్సు ఆఖర్లో విద్యార్థులకు (గ్రాడ్యుయేషను పరీక్షలు రష్యా భాషలోను (లేదా మాతృ భాషలోను), లెక్కలలోను జరుగుతాయి. వానిలో ఉత్తీర్ణులైన వారికి ఎనిమిదేళ్ళ పాఠశాలలో గ్రాడ్యుయేషను తరగతులు పూర్తి చేసినట్టు సర్టిఫికెట్టులు యివ్వడం జరుగుతుంది. సెకండరీ పాఠశాలల్లో, సాంకేతిక పాఠశాలల్లో ఆ పై గ్రేడుల్లో చదువు కొనసాగించడానికి యీ సర్టిఫికెట్లు వారికి వుపయోగిస్తాయి.

మొదటి నాలుగు గ్రేడుల్లోనూ పిల్లలకు వివిధ సబ్జెక్టులన్నిటినీ ఒక్క ఉపాధ్యాయుడే నేర్పుతాడు. సీనియరు గ్రేడుల్లో ఒక్కొక్క సబ్జెక్టును ఒక్కొక స్పెషలిస్టు ఉపాధ్యాయుడు నేర్పుతాడు.

అన్ని సంవత్సరాల్లోనూ రెండు సబ్జెక్టులను విధిగా నేర్వాలి. ఒకటి అంకగణితమూ, తద్వారా గణిత శాస్త్రము; రెండు – మాతృభాష, సాహిత్యము. రెండవదానిలో యీ కోర్సు అక్షరాలు మొదలుకొని కావ్యాల వరకూ, సమకాలీన సాహిత్యంతోసహా నేర్పడం జరుగుతుంది. సాహిత్యపు పాఠాలే పిల్లల నైతిక, కళాత్మక దృష్టి రూపొందడానికి ప్రధాన కారణాలుగా నిలుస్తాయి. ఈ పాఠాలు సాధారణంగా జీవితకాలమంతా జ్ఞాపకం వుండిపోతాయి. మధురమైన పాఠశాల జీవితంతో యివి ముడివేసుకుని వుండిపోతాయి. రష్యాలోని ప్రతి పాఠశాల విద్యార్థిమీద పుష్కిన్, టాల్‌స్టాయ్, గోర్కీ, మైకావిస్కీల రచనల ప్రభావం వుంటూనే వుంటుంది.

సైన్సు, టెక్నాలజీలలో చూపించే శ్రద్ధకు పాశ్చాత్య విద్యావేత్తలు సాధారణంగా అచ్చెరువుచెందుతుంటారు. ప్రతి విద్యార్థి భౌతిక శాస్త్రాన్ని అయిదేళ్ళపాటు, రసాయనిక శాస్త్రాన్ని నాలుగేళ్ళపాటు, జీవశాస్త్రాన్ని ఆరేళ్ళపాటు చదువుతాడు. సోవియట్ దేశంలోని బాలుడుగానీ, బాలికగానీ 17వ ఏట పాఠశాలను విడిచిపెట్టేసరికి శాస్త్రీయ విజ్ఞానంలో చాలా మంది అమెరికా కళాశాలల పట్టభద్రులకన్న మెరుగ్గా వుంటారని ఒక అమెరికా అధికారి వ్యక్తం చేశారు. అమెరికాలోని బాగా అడ్వాన్సు చెందిన కళాశాలలో ప్రవేశానికి అవసరమయ్యే పరిజ్ఞానానికి అయిదురెట్లు ఎక్కువగా మామూలు సోవియటు పాఠశాల విద్యార్థి శాస్త్ర విజ్ఞానంలోను, గణితంలోను పరిజ్ఞానం కలిగివుంటాడని లెక్కలవల్ల తేలింది.

ఈ ఎనిమిదేళ్ళ విద్యాబోధనా కాలంలోనూ 45 శాతం వరకు తరగతులను హ్యుమానిటీస్ (మాతృభాష, సాహిత్యం, రష్యా చరిత్ర, రాజ్యాంగం, ఒక విదేశభాష, చిత్రలేఖనం, సంగీతం, గానం)కు, 35 శాతం స్వభావిక, వాస్తవిక శాస్త్రాలు (గణితం, భౌతికశాస్త్రం, రసాయనిక శాస్త్రం, జీవశాస్త్రం, ఫిజికల్ జాగ్రఫీ, డ్రాఫ్టింగ్)కు 15 శాతం యితరములైన ప్రసిద్ధికెక్కిన కార్మికవిద్యకు, 7 శాతం ఫిజికల్ ఎడ్యుకేషన్‌కు విభాగించబడివుంటుంది.

అయిదవ గ్రేడు తరగతులనుంచి విదేశభాషలు నేర్పడం జరుగుతుంది. కొన్ని పాఠశాలల్లో యింకా ముందుగా కూడా నేర్పుతారు. విద్యార్థులు ఇంగ్లీషుకాని, ఫ్రెంచికాని, జర్మనీకాని, ఒక్కొక్కచోట స్పెయిను కాని ఏదో ఒకటి నేర్చుకోవచ్చు. చాలా పాఠశాలల్లో, ముఖ్యంగా సెంట్రల్ ఆసియాలో హిందీకూడా ప్రవేశపెట్టబడింది. లెనిన్‌గ్రాడ్‌లో కనీసం రెండు పాఠశాలల్లో హిందీ నేర్పబడుతున్నది. పెద్దపెద్ద నగరాలలో ఒకటి రెండు పాఠశాలల్లో ఒక విదేశ భాషలో పై తరగతుల అధ్యయనం కూడా వుంది. ప్రతి పాఠశాలలోనూ 20 మంది కన్న ఎక్కువ విద్యార్థు లున్న తరగతులను విదేశభాషల అధ్యయనంలో సులువుకై రెండు బృందాలుగా విభజించబడతాయి. టేపురికార్డులు, సినిమా ప్రదర్శనలు, మొదలయిన వాటిని విరివిగా వాడతారు. ముఖ్యంగా ప్రసంగ విధానానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వడం జరుగుతుంది.

ఈ మాదిరి విస్తృత విద్యాబోధనా విధానం మన పిల్లలపై ఎంతగానో ప్రభావాన్ని ప్రసరిస్తున్నది. శాస్త్రీయ రంగంలో, టెక్నాలజీలో శీఘ్రగతిని వస్తున్న అభివృద్ధివల్లా, మానవ విజ్ఞానం నిరంతరం విస్తరిల్లుతున్నందువల్లా విద్యాబోధన బహు కష్టంతో కూడుకున్న పనైంది. అయినప్పటికీ వాటినికూడా మరీ వివరంగా విశదీకరణద్వారా తేలిక చేసుకోవడం జరుగుతున్నది.

ఎనిమిదేళ్ళ కోర్సును పూర్తిచేయడంతో బాలబాలికలు తమతమ శక్తి సామర్థ్యాలనుబట్టి, అభిరుచులనుబట్టి తమతమ జీవనపథాన్ని ఎన్నుకునే స్వేచ్ఛ వారికి లభిస్తుంది. కొంత మంది ప వర్తకమో నేర్చుకోందామనుకుంటారు. అలాంటివారు పనుల్లో చేరతారు. అలాంటివారికి ఏడాదినుంచి మూడేళ్ళ వరకు వృత్తి శిక్షణ పాఠశాలలు వున్నాయి. ఇతరులు సెకండరీ పాఠశాలల్లో తమ విద్యను కొనసాగించవచ్చు. లేదా సెకండరీ సాంకేతిక పాఠశాలల్లో చేరవచ్చు. అక్కడ వీరికి సాధారణ సెకండరీ విద్యతోపాటు ప్రత్యేక విద్య గరపబడుతుంది.

(సశేషం)

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

మార్చి 20: ప్రధానమంత్రి శ్రీ లాల్‌బహాదుర్ శాస్త్రి రెండురోజుల పర్యటనపై హైదరాబాదు వచ్చారు.

ప్రధానమంత్రి, రాజేంద్రనగర్‌లో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయానికి ప్రారంభోత్సవం చేశారు.

మార్చి 21: ప్రధానమంత్రి హైదరాబాదులో అఖిల భారత గోసంవర్ధన సమ్మేళనానికి ప్రారంభోత్సవం చేశారు.

మార్చి 31: ఆంధ్రప్రదేశ్ శాసనసభ, శాసనమండలి సమావేశాలను నిరవధికంగా వాయిదావేశారు.

ఏప్రిల్ 3: ముఖ్యమంత్రి ఆంధ్రప్రదేశ్ గౌరవ మేజిస్ట్రేటుల సంఘానికి ప్రారంభోత్సవం చేశారు.

ఏప్రిల్ 6: హైదరాబాదులో జరిగిన రంజీ ట్రోఫీ పోటీలో బొంబాయి జట్టు, హైదరాబాదు జట్టును ఓడించి 7 వ పర్యాయం ట్రోఫీని గెలుపొందింది.

పదిమంది సభ్యులుగల ఆఫ్ఘన్ ప్రతినిధి వర్గం మూడురోజుల పర్యటనపై హైదరాబాదు వచ్చింది.

## భారతదేశంలో

మార్చి 13: 1965 భారత పార్టనర్‌షిప్ (ఆంధ్రప్రదేశ్ సవరణ) చట్టానికి రాష్ట్రపతి ఆమోదం తెల్పారు.

మార్చి 14: పశ్చిమ జర్మనీలోని బడెన్ వెర్టంబర్గ్ ముఖ్యమంత్రి శ్రీ కెంట్ జార్జి కై సింగర్ రెండు వారాల పర్యటనపై క్రొత్తఢిల్లీ వచ్చారు.

మార్చి 15: రాష్ట్రపతి, నేత్ర చికిత్స నిమిత్తం, క్రొత్త ఢిల్లీనుంచి విమానంలో బయలుదేరి లండన్ వెళ్ళారు.

మార్చి 18: మలయేసియా డిప్యూటీ ప్రధానమంత్రి, శ్రీ టున్ అబ్దుల్‌రజాక్ క్రొత్తఢిల్లీ వచ్చారు.

మార్చి 22: క్రొత్తఢిల్లీలో న్యూజిలాండ్ తోటి జరిగిన నాల్గవ క్రికెటు పోటీలో భారతదేశం గెలుపొందింది.

ఏప్రిల్ 2: శ్రీ అజిత్ ప్రసాద్ జైన్, కేరళ గవర్నరుగా ప్రమాణ స్వీకారం చేశారు.

శ్రీ వి. వి. గిరి, మైసూరు గవర్నరుగా ప్రమాణస్వీకారం చేశారు,

ఏప్రిల్ 10: కేంద్ర వ్యవసాయశాఖ మాజీ మంత్రి డాక్టర్ పంజాబురావు దేశముఖ్ క్రొత్తఢిల్లీలో మరణించారు.

డాక్టర్ కిరణ్‌సింగ్, జమ్మూ.కాశ్మీర్ గవర్నరుగా ప్రమాణస్వీకారం చేశారు.

## విదేశాలలో

మార్చి 16: శ్రీ గమాల్ అబ్దుల్ నాసర్, ఐక్య అరబ్ రిపబ్లిక్ అధ్యక్షులుగా తిరిగి ఎన్నిక అయ్యారు. ఆరు సంవత్సరాల పాటు పదవిలో ఉంటారు.

మార్చి 18: ఈజిప్టు మాజీరాజు ఫరూక్ రోమ్ నగరంలో మరణించారు.

మార్చి 19: రుమేనియా అధ్యక్షులు శ్రీజార్గీ జార్గిన్-డెజ్, బుఖారెస్టులో మరణించారు.

సోవియట్ రోదసీ యాత్రికులు శ్రీ బలియేవ్, లీనేవ్‌లు అంతరిక్షంలో అద్భుతకార్యాలు ఒనర్చి సురక్షితంగా తిరిగి భూమిపైకి వచ్చారు.

మార్చి 25: శ్రీ డడ్లీ సేనానాయకే, సిలోన్ 8 వ ప్రధానమంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు.

మార్చి 31: స్పానిష్ చార్టర్డ్ విమానం టాంఘీర్ వద్ద మధ్యధరా సముద్రంలో కూలిపోయింది.

ఏప్రిల్ 4. చోగ్యాల్ పాల్డెన్‌తోండప్ నాంగ్యాల్ సిక్కిమ్ మహారాజా పట్టాభిషేకం జరిగింది.

నేతపనివారి సేవాకేంద్రాలు
భారత చేనేత పరిశ్రమలకి తోడ్పడుతవి



# ప్రత్యేక శిక్షణ

అభివృద్ధిచెందిన శాస్త్రీయ పద్ధతుల్లో శిక్షణ పొందిన పనివారలు తమ నేతలో ఆధునికమయిన నమూనాలు, డిజైన్లు, ఫాషన్లు తీసుకరాగలరు. వారి అందమయిన, ఉపయోగకరమయిన వస్త్రాలు బహుళ ప్రచారంలో నున్నవి.

అన్నీ అమరిన ఆధునిక సాంకేతిక శాస్త్రాగారాల్లో నేతపనివారి సేవా కేంద్రాలు, స్వల్పకాల శిక్షణ కోర్సులు, నేతపనివారికొరకు, అద్దకపు పనివారికొరకు, నమూనాలు తయారుచేయువారికొరకు, అభివృద్ధిచెందిన శాస్త్రీయ పద్ధతుల్లో, పనినేర్పుటకు ప్రవేశపెట్టినవి.

మీరీ శిక్షణ కోర్సులలో చేరి ఉపకారవేతనము పొందే సౌకర్యాన్ని వినియోగించుకోండి. నేతపనివారల సహకార సంఘాలు తమకి దగ్గరగావున్న నేతపనివారి సేవాకేంద్రంలో సంప్రదించవచ్చును.

నేతపనివారి
సేవాకేంద్రము
మద్రాసు
(ఉపకేంద్రము కంచీవరంలో)
20, ఆలివర్ రోడ్, మైలాపూర్;
మద్రాసు-4.

 అఖిల భారత చేనేత బోర్డు

DA 64/595



ఆదిలాబాదుజిల్లా

*కమ్యూనిటీ రేడియోకు ప్రారంభం:*

ఆదిలాబాదు పంచాయతీ సమితిలోని గున్న పంచాయతీ ఘర్‌లో కమ్యూనిటీ రేడియో ప్రారంభించ బడింది.

కడపజిల్లా

*పంచాయతీరాజ్ శిక్షణ:*

కడప పంచాయతీరాజ్ శిక్షణ కేంద్రం ప్రొద్దుటూరులో మార్చి 20 నుండి మూడు రోజులపాటు సమావేశ శిబిరాన్ని నిర్వహించింది. తొమ్మిది గ్రామాలనుండి నలభై మంది పంచాయతీ సభ్యులు యిందులో పాల్గొన్నారు.

గుంటూరుజిల్లా

*పాఠశాలా భవనం:*

ఈమని పంచాయతీ సమితిలోని అట్లూరి వారి పాలెంలో పంచాయతీ సమితి ప్రాథమిక పాఠశాల భవనానికి కలెక్టరు మార్చి 25 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

*మైక్రో బయాలజీ లేబరేటరీ:*

గుంటూరులోని ప్రభుత్వ జనరల్ ఆసుపత్రిలో మార్చి 26 వ తేదీన ఒక మైక్రో బయాలజీ లేబరేటరీకు ప్రారంభోత్సవం జరిగింది.

*విమానాలద్వారా ఎరువుల చల్లకం:*

పొన్నూరు పంచాయతీ సమితి ప్రాంతంలోని సుమారు 12 గ్రామాలలోని 6,000 ఎకరాలకు పైగా నేలలో కొత్తగా నాటిన రెండో వరిపంటకు రసాయనిక ఎరువులను విమానంద్వారా చల్లే కార్యక్రమాన్ని గుంటూరుజిల్లా వ్యవసాయ శాఖ నిర్వహించింది.

హైదరాబాదుజిల్లా

*గ్రామలక్ష్మి శిక్షణ శిబిరం:*

తాండూరు పంచాయతీ సమితిలోని పెద్దముల్‌లో మార్చి 22 నుండి మూడు రోజులపాటు గ్రామలక్ష్మి శిక్షణ శిబిరం నిర్వహింపబడింది

*కుటుంబనియంత్రణ శిబిరం:*

వికారాబాదు పంచాయతీ సమితిలోని పూడూరులో మార్చి 27 వ తేదీన కుటుంబ నియంత్రణ తాలూకు పునశ్చరణ శిబిరం నిర్వహింపబడింది.

మొమిన్ పేటలో మార్చి 22 నుండి ఒకవారం రోజులపాటు కుటుంబనియంత్రణ ఓరియంటేషన్ శిక్షణశిబిరం ఏర్పాటు చేయబడింది.

కరీంనగర్ జిల్లా

*మార్కెట్ కమిటీ భవనం:*

మార్చి 26 వ తేదీన కరీంనగర్‌లో మార్కెట్ కమిటీ భవనానికి ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.

*శిక్షణ శిబిరం:*

నాగపూర్ గ్రామంలో మార్చి 25 వ తేదీన గ్రామ సహాయకుల శిక్షణశిబిరం ఒకదానిని కరీంనగర్ పంచాయతీ సమితి నిర్వహించింది. వ్యవసాయం, పశుపోషణ, సాంఘికవిద్య మొ॥ వాటిలో యాభై మందికి శిక్షణ యివ్వడం జరిగింది.

కరీంనగర్ పంచాయతీ సమితిలోని కొత్తపల్లి ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో ఏప్రిలు 6 వ తేదీన కుటుంబనియంత్రణ శిక్షణ శిబిరం నిర్వహించబడింది.

ఖమ్మంజిల్లా

*కుటుంబనియంత్రణ శిబిరం:*

కల్లూరులోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో కుటుంబనియంత్రణ ఓరియంటేషన్ శిబిరం ఏర్పాటు చేయబడింది. ఈ సందర్భంలో 300 వసెక్టమీ ఆపరేషన్లు నిర్వహించబడ్డాయి.

*సహకార సెంట్రల్ బ్యాంకు:*

ఖమ్మంలో దేవాదాయ మంత్రి ఏప్రిలు 8 వ తేదీన సహకార సెంట్రల్ బ్యాంకు ఒకదానికి ప్రారంభోత్సవం చేశారు.

కృష్ణాజిల్లా

*ప్రణాళికా గోష్ఠి:*

విజయవాడలో మార్చి 22 వ తేదీన ప్రణాళికా సమాచార గోష్ఠి ప్రారంభించబడింది. ఇంద్రకీలాద్రి కొండ మీదకు కంకరరోడ్డుకు మార్చి 28 వ తేదీన కేంద్ర జల, విద్యుచ్ఛక్తి శాఖామంత్రి ప్రారంభోత్సవం చేశారు.

కర్నూలుజిల్లా

*సాంఘిక సేవాశిబిరం:*

గార్గేయపురంలో మార్చి 23 నుండి రెండు రోజులపాటు సాంఘిక సేవాశిబిరం నిర్వహింపబడింది.

మహబూబ్‌నగర్ జిల్లా

*శిక్షణ శిబిరం:*

నాగర్ కర్నూలు పంచాయతీ సమితిలోని శ్రీపూర్‌లో ఏప్రిలు 3 నుండి గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహింపబడింది.

నాగర కర్నూలు పంచాయతీ సమితిలోని పెద ముదునూరుగ్రామంలో మార్చి 28 న ముప్పై వసెక్టమీ ఆపరేషన్లు నిర్వహింపబడ్డాయి.

## ప్రగతి పథంలో

కుటుంబ నియంత్రణ సదస్సు :

మూడురోజులపాటు జరిగే కుటుంబ నియంత్రణ సదస్సుకు శ్రీరంగాపూర్‌లో కలెక్టరు ప్రారంభోత్సవంచేశారు.

మెదక్ జిల్లా

సమితి భవనం :

గజ్వేలులో ఏప్రిల్ 4 వ తేదీన పంచాయతీ సమితి కార్యాలయ భవనానికి ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.

నల్గొండ జిల్లా

శిక్షణ శిబిరం :

మోతకుండూరులో ఏప్రిలు 7 వ తేదీన గ్రామసహాయకుల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించబడింది. 56 మంది గ్రామస్తులు యీ శిబిరంలో పాల్గొన్నారు.

నిజామాబాదు జిల్లా

గిడ్డంగి :

20,000 టన్నుల ఆహారధాన్యాలను నిలవచేయడానికి వీలైన గిడ్డంగి ఒకదానికి ఏప్రిల్ 6 వ తేదీన నిజామాబాదులో కలెక్టరు శంకుస్థాపన చేశారు.

వరంగల్లు జిల్లా

కుటుంబనియంత్రణ :

వరంగల్లులో ఆరు రోజులపాటు జరిగే కుటుంబనియంత్రణ శిక్షణ శిబిరానికి మార్చి 29 వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది.

గణపూర్ పంచాయతీ సమితిలోని మల్కాపూర్‌లో ఏప్రిలు 6 వ తేదీన కుటుంబ నియంత్రణ ఓరియంటేషన్ శిబిరం ఒకటి నిర్వహించబడింది. సలభై ఎనిమిది వాసెక్టమీ ఆపరేషన్లు చేయడం జరిగింది.

మహిళల శిక్షణ శిబిరం :

గణపూర్‌లో మూడురోజులపాటు మహిళల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించబడింది. దానితోపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం కూడా నిర్వహించబడింది. ఈ శిబిరంలో 50 మంది గ్రామ పెద్దలకు శిక్షణ యివ్వడం జరిగింది.

గ్రామీణ విద్యుదీకరణ :

పైండర్తి గ్రామంలో విద్యుచ్ఛక్తి సౌకర్యానికి ఏప్రిల్ 8 వ తేదీన వరంగల్లు జిల్లా పరిషత్తు ఛైర్మను ప్రారంభోత్సవం చేశారు.

✻

---

(8వ పేజీ తరువాయి)

నలుగురు హంతకులను కాపాడానని చెప్పేవాడు. అటువంటివాడు నన్ను సంఘద్రోహి కింద జమకట్టి వెలివేసేశాడు. నేనే హత్య చేసిఉంటే నాకేసుపట్టి, నాకు ఉరిపడకుండా ఉండటానికి సర్వశక్తులూ ధారపోసి ఉండేవాడు. నే నాపని చెయ్యలేకపోతిని. పైగా నన్ను సమర్థించటంవల్ల ఆయనకు కానీ రాదాయె. మా నాన్నకి పెన్షన్ హ్యూమర్ లే దింతకూ!"

డాక్టరుగారీసారి విశాలంగా నవ్వాడు. తండ్రి తనను వెలివేసినందు కాయన బాధ పడుతున్నాడా? పడుతూంటే నేను తప్పు పట్టను. కాని బాధపడనిపక్షంలో సంతోషిస్తాను.

నోరు చేసుకుని అడిగేశాను.

"దాని కెందుకుండదోయ్. తగిన కారణం ఉండే స్నేహితుడిలాంటివాడు మనతో మాట్లాడటం మానేస్తే ఎంతో బాధగా ఉంటుంది గదా? మన చిదానందం వైజాగ్‌లో చదువుతా ఉంటేనేనేదోగాఉండినాను... అదీగాక మనుష్ని వెలివెయ్యటం మా నాన్న స్వభావానికి విరుద్ధం. పైకి చూపించటం చాతకాదు. చూపించటానికి బిడియం కూడాను - కాని ఆయనకు ప్రేమలు జాస్తి. లోపల చాలా సంఘర్షణ పడతాడు. మా అమ్మ నాకు బాగా బుద్ధితెలిశాకే పోయింది. ఎప్పుడూ ఆయన ఆవిడతో మృదువుగా గాని, హాస్యధోరణిలోగాని మాట్లాడగా విన్నట్టు నాకు జ్ఞాపకం లేదు. కాని ఆవిడ పోయినాక ఆయన సదాదివాటు తృప్తిగా నవ్వలేదు. తాను సంపాదించిన డబ్బులాగే తన ప్రేమలనుకూడా ఎక్కడో ఫిక్సెడ్ డిపాజిట్‌లో ఉంచేశాడు. వాటిని అనుభవించటం ఈ నాటికీ చాతకాలేదు. ఏటి! ఆయన తన వృత్తిమీద అంత కేంద్రీకరించకపోతే జీవితంలో ఇకా ఎక్కువ సుఖం అనుభవించి ఉండేవాడు ''

సుందరమ్మగారు భోజనానికి రమ్మన్నదాకా మేం ఇదేవిధంగా ఏవో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం. నేను మా అమ్మను గురించి చెప్పాను. డాక్టరుగారితండ్రి సుఖాన్ని అణచిపెట్టుకుంటే మా అమ్మ కష్టాన్ని అణచుకున్నది. మా అమ్మ తన కన్న పాలిట్కు పెదవాళ్ల పెళ్ళాకి. అందువల్ల కలిగిన బాధను ఎవరికీ తెలీకుండా అణచుకున్న దని చెబితే డాక్టరుగారు "ఎలా చెప్పగలం? కొందరాడవాళ్ళు తమ కన్న చాలా హెచ్చువయసు భర్తలతో చాలా సుఖపడతారు.'' అన్నాడు నన్ను సముదాయించటానికే కావచ్చు.

"లేదు లెండి ఆవిడకు అది గుండెలో ములికాయి ఉండాలని నాకు రూఢిగా తెలుసు. మా ఇంటిపక్క సందులో ఒక ఎనిమిదేళ్ళ పిల్లను ఇరవై ఏళ్ళవాడి కిచ్చి పెళ్ళి చేస్తుంటే మా అమ్మ, 'అంత చిన్నపిల్లను తీసుకుపోయి అంత పెద్దవాడి కేమని అంటగడతారో!' అన్నది. నేను చెవులారా విన్నమాట. అప్పట్లో నా కర్థం కాలేదు. అర్థమయినాక అది నా గుండెల్లో ములికి అయి, తలుచుకున్నప్పుడల్లా బాధ పెడుతుంది." అన్నాను.

డాక్టరుగారు చాలాసేపు ఏదో ఆలోచనలో ఉండిపోయినట్టు కనబడి, చివరకు, "కొన్ని కొన్ని అనుభవాలు చూస్తుంటే వివరించమంటూ ఉన్నదేమో ననిపిస్తుంది," అన్నాడు.

ఆ రాత్రికూడా భోజనం చాలా బాగుండటం చూసి నాకు ఆశ్చర్యం కలిగింది. మధ్యాహ్నం భోజనం బాగుండటానికి కారణం నేను అతిథిగా ఉండట మేనో నని అహంకారంగా అనుకున్నాను. నాకు రోజూ రెండు తిండికూడా పేదగా ఉంటుం దని ఎందు కనుకున్నానో నాకే తెలీదు. కొన్ని విషయాలలో వాళ్ళు పేదగా కనపడటం చూసి, అన్ని విషయాలలోనూ అంతే అయిఉంటుం దనుకునిఉంటాను. నాలుగు రోజులు వరసగా భోజనం చేసినాక తెలిసివచ్చింది. వాళ్ళ ఆహారంలో మంచి వెరైటీ ఉన్నది. సుందరమ్మగారి వంట కూడా చాలా బాగుంటుంది. వాళ్ళింటో ముగ్గురూ ఆరోగ్యంగానే ఉంటారు. తల్లి కూతుళ్ళు ఇంటిపని యావత్తూ స్వయంగా చేసుకుంటారు. పనిమనిషిని పెట్టుకోరు. సర్వు పొద్దున్నే లేచి వొడ్డి యావత్తూ చిమ్ముకొస్తుంది. ఒక్కొక్క రోజు గడుస్తున్నకొద్దీ, డాక్టరుగారి కుటుంబంతో పరిచయం బలమవుతున్నకొద్దీ నాకు వాళ్ళతోఉన్న సంబంధం దృఢమయింది గాని నేను భయపడ్డట్టుగా జరగలేదు. (సశేషం)



## ఆమె అతిథులను ఎవరినీ ఆహ్వానించ లేదనా నీ వనేది!

అది ఆమె ఒక్కగానొక్క కుమారుని వివాహమయినాకాని, కమ్మని విందు చేయాలన్న కుతూహలాన్ని అణచుకున్నది. చాల కొద్దిమంది స్నేహితులకు, బంధువులకు చాల నిరాడంబరమయిన, సామాన్యమయిన భోజనము ఏర్పాటు చేసింది.

కాని చాలమంది వివాహాలలో విరివిగా ఖర్చు చేస్తారు.
నిశ్చయంగా, అందువల్ల హాని జరగదంటారా ?

కొరతగా వున్నది, పెద్ద విందులంటే అర్థము ఆహారము వృథా చేయడము. ఆహారము నిలువచేసేవారిని, అక్రమ లాభాలు పొందేవారిని అదుపులో పెట్టదలచుకుంటే, మనమిలాంటి విందులకు పూనుకోరాదు. మనం మనకు నిజంగా ఎంత అవసరమో అంతే ఆహారము కొనుక్కోవాలి.

**వృథా కానీయకండి ఆహార సమస్యా పరిష్కారానికి తోడ్పడండి**

## వనితాలోకం



బులుసు రామలక్ష్మి

# సమాజంలో స్త్రీ

"స్త్రీ" అనే మాటకు వివిధ నామధేయాలు ఉన్నాయి. అందులో "అబల" అనేది ఒకటి. సంఘంలో స్త్రీనే కేవలం అబలగా ఎందుకు గుర్తించారు, అంటే ఆమె శారీరకంగా బలమైనా, బలహీనమైనా, మానసికంగా బలహీనురాలు, స్వతంత్రించి ఎవ్వరి సలహాలేనిదే ఏపనీ చెయ్యలేదు. ప్రతిఒక్క అంశంలోకూడ ఆమె వంటరిగా ప్రవర్తించలేదు. ఆమెకో మనిషి ఆసరా ముఖ్యావసరం. కేవలం తన శక్తిసామర్థ్యాలపైతను ఆధారపడలేనిది కనుకనే స్త్రీని అబల అన్నారేమో అనిపిస్తుంది.

పూర్వకాలంలో రచింపబడిన ప్రబంధాలలో, ప్రాచీన కవులు, స్త్రీలని లతలతో సరిపోల్చి వర్ణించారు. స్త్రీయొక్క అబలత్వాన్ని మంచి ఉపమానంతో చెప్పారు. లతల కేవిధంగా ఆధారంలేనిదే బ్రతుకలేవో, స్త్రీకూడ అల్లే ఆధారంలేనిదే సంఘంలో జీవింపలేదు.

బిడ్డ పుట్టిందిమొదలు కొంతకాలం తల్లిదండ్రులవద్ద పెరుగుతుంది. ఆమెయొక్క ఆలన పాలన, చదువు సంధ్యలు, మంచి చెడుగులు చూచేది చిరుతప్రాయంలో తల్లిదండ్రులు. ఆమెకి సరియైన శిక్షణనిచ్చి, విజ్ఞానవంతురాలులా తయారుచేసిన పిదప ఆమెయొక్క బాధ్యత భర్తకప్ప చెప్తారు. అత్తవారింట్లో అత్తమామల అదుపాజ్ఞల్లో, భర్తఅనురాగంలో కాలం గడుపుతుంది యవ్వనకాలంలో. అది దాటినపిదప వార్ధక్యంలో అడుగు పెడతారు. అప్పుడు వారి జీవితాలు కొడుకులపై ఆధారపడి ఉంటాయి. ఎప్పుడు ఒకరిపై ఆధారపడి ఉంటారో, అప్పుడు వారికి తలవంచి ఉండాలికదా!

మొత్తం స్త్రీజీవితం పుట్టిందిమొదలు గిట్టేవరకు ఎవరో ఒకరి అదుపాజ్ఞల్లో ఉండవలసిందేకాని, స్వతంత్రంగా బ్రతికేది కాదు. ఈ విషయాలనే చిన్న పాటగా తయారుచేసి అందులో స్త్రీగా తనుపుట్టి ఎట్లు బ్రతకాలో తెల్పుతారు పెద్దలు.

అట్లతదియ నోముని తెలుగువారింటి ఆడబిడ్డలు, కోడండ్రు కూడ ఈ నోము చేస్తారు. ఈ రోజు సోముడ్ని పూజలొనరిస్తారు. పూజానంతరం పిడికిళ్ళతో బియ్యం పట్టి, ఒకదానిపై వేరొకచెయి అడ్డుగాపెట్టి ఒకపాట పాడుతూ; ఆ బియ్యం పీటపై పోస్తారు.

అతివరో నీవు పుట్టింది ఆడజన్మాయె,
తల్లిదండన తండ్రిదండన కలిగి యుండాలి.
అత్తదండన మామదండన కలిగియుండాలి.
పురుషుడి దండన పుత్రుడి దండన కలిగి
యుండాలి.
మన్ననకల ఇంటిలో నీవు మానిని పుట్టితివి.
మా చిన్నారి మరువకుమమ్మ మంచి
బుద్ధులను...
జన్మ జన్మలకైననీవు జగతి లోపలను...

ఈ విధంగా బ్రతకాలి అంటూ, మసలవలసిన తీరు బోధిస్తారు. అంతే కాకుండా పెద్దలు - భగవంతునిముందు పూజానంతరం యువతులచేత "దండనకలిగి యుండాలి" అంటూ అనిపిస్తారు. ఒకవిధంగా భగవంతుడ్ని కోరే "వరం" కూడా ఇదేనేమో అనిపిస్తుంది. అది ఈ జన్మకే కాకుండా జన్మ జన్మలకి కూడా దండనకలిగే యుండాలని కోరుకుంటుందా చిన్నది నిశ్చలమైన మనస్సుతో.

ఇచ్చట "దండన"కి బదులు "అండ"ని కూడ అర్థం చెప్పుకుంటే. అండ కావాలని అర్థంవస్తుంది. స్త్రీ స్వతంత్రంగా బ్రతకలేదు కాబట్టి అండకావాలని కోరుకుంటుంది. పరిస్థితులు మారినా, కాలం ఎంత పురోభివృద్ధిలో ఉన్నా స్త్రీ నాటికి, నేటికీకూడ అబలే.

నేటి పరిస్థితులలో పురుషులతో సమాన హక్కులు స్త్రీలకి ఉన్నవి. కాని వారివలె వంటరిగా స్వతంత్రంగా తను బతకలేదు. ఒకవేళ అట్లా స్వతంత్రించిననాడు అనేక కష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది. భరింపరాని నిందలు మోయవలసి వస్తుంది. ఈకష్టాలనుతప్పించుకొనేందుకు యీనిందలు రాకుండా కాపాడుకునేందుకు ఒకే ఒక్క మార్గం. అదే ఆమెకొక అండ అవసరం. స్త్రీ పురుష విచక్షణ లేక, ఎవరో ఒకరి సహాయం లేనిదే ఆమె బ్రతకలేదు సంఘంలో గౌరవంగా. ★

# ప్రభుత్వ నిర్ణయాలు

* వివిధ పథకాల నిమిత్తం అయ్యే ఖర్చుపై ఎప్పటికప్పుడు, పటిష్ఠవంతమైన కంట్రోలు అజమాయిషీకై తగుచర్యలను సిఫారసు చేయడానికీ, ప్రభుత్వ వ్యయంపై ఆడిట్ నివేదిక లను అప్పుడప్పుడు పరిశీలించడానికి మంత్రిమండలి ఉపసంఘం ఒకటి ఏర్పాటు చేయబడింది. ప్రణాళికాలక్ష్యాలు—ఆర్థిక, భౌతిక లక్ష్యాలు రెండు—పూర్తిగా నెరవేరేటట్లు ఈ ఉపసంఘం చూస్తుంది.

* వ్యవసాయంతోపాటుగా కొబ్బరిచెట్లు, ఈతచెట్లు పెంపకానికై ఏర్పాటు చేయబడిన సేద్య కూలీల సంఘంకు ప. గోదావరి జిల్లాలోని ఉప్పుటూరువద్దగల 250 ఎకరాల అడవినేలను యివ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

* బియ్యం మిల్లులను ఏర్పాటు చేయడానికై ప్రయివేటు రంగంక్రింద వచ్చిన 1,100 లు అప్లికేషన్ దరఖాస్తులను రెండునెలల వ్యవధిలో పరిశీలించి తగుచర్యలు తీసుకోవడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

* నల్గొండ, కరీంనగర్, ఖమ్మం జిల్లాలలో ఉర్దూకూడా న్యాయస్థానంలో వాడే భాషగా గుర్తించడానికి ప్రభుత్వం నిశ్చయించింది.




"ఏమోయ్; మీ ఆయన నిద్దట్లో నడుస్తాట్టగా ?"
"నిజమే ! ఆయన బిహాలనోమరి. రెండుమూడుగజాలే నడుస్తాడు. ఆ తరువాత కింద పడుకుంటాడు."




"నీవు మరీ పాతకాలపు అలవాట్లన్నీ నేర్పకు. పాప ఇష్టప్రకారమే కానివ్వు. ఇంతకీ ఏమంటుంది ?"
"ఇంటిమ్ముం దున్న పూలమొక్కల ఆకులు తింటా నంటుంది."

**Edited and Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1**
**Printed at YUVA Press, Public Garden Road, Hyderabad.**